# ఈ సంచికలో



ముఖచిత్రం సంక్రాంతి సంబరం

చిత్రకారుడు వ పా




మేలుకొనే జీవశక్తి లాంటి వ్యాసాలు ప్రచురించి పాఠకులకు ఆనందాన్ని కలుగ జేసిన సంపాదకులు అభినందనీయులు

ఎ దమయంతి

ఖిలాయ్

మేలుకొనే జీవశక్తి వ్యాసం చదువుతున్నంత సేపూ పళిపాఎలపై ఎంతో మురిపెం కలుగుతూంది

డి రాజేశ్వరి

హైదరాబాదు

యువ రెండు–మూడు కవర్ పేజీల్లో సినిమా బొమ్మలు వేయకుండా మా అభిమాన చిత్రకారులైన శ్రీ వపా గారి వర్ణచిత్రాలు వేస్తే వారి చిత్రాలకు మెరుగునిచ్చి చిత్ర కళాభిమానులకు ప్రీతిని కలుగజేసిన వారవుతారు

యిన్ కృష్ణమూర్తి

కూచినపూడి

డిసెంబరు యువలో 'దేవుళ్ళపాట్లు బావ వచ్చే వేళ చిలుక తెచ్చిన కబురు చాలా బాగున్నవి

హెచ్ రామన్‌గౌడ్

గుంటకల్

భంగపాటు బహిష్కృతుడు కథలు నన్ను ఆకర్షించాయి

పాఠకుడు

హైద్రాబాద్

డిసెంబరు యువ చాలా బాగుంది అట్టమీద బొమ్మ ఆకర్షణీయంగా వుంది "ప్రశ్నావేదిక" యువకు ఒక ప్రత్యేకాకర్షణ

కే సూర్యకాంతరావు
బాల్కొండ

నదీజలాల పంపకం గురించి తాము వ్రాసిన సంపాదకీయం నన్ను చాల ఉత్సాహ పరిచింది ఎందుకంటే మొదటినుండీ ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం అవలంబిస్తూన్న పద్ధతి నాకు ఏమాత్రం సరిపడలేదు. కేంద్రంలో హేమా హేమీలైన వారు మంత్రి వర్గంలో (మనవారు) ఉండీ యితర రాష్ట్రాల వారి మద్దతు తీసుకోవడం చాలా శోచనీయమైన సంగతి ఒక (గుల్జారీ సంఘము) కమిషన్‌ని నియమించడం జరిగినా అందువలన కలిగే లాభం ఏమీ లేక పోయిందికదా అది వేరే సంగతి ఆంధ్రదేశ పురోభివృద్ధికి ఆటంకం కలుగజేయడం ఇరుగు పొరుగు రాష్ట్రాలకు ఏమంత భావ్యమైన పనికాదు అన్నిరాష్ట్రాలూ ఆరోగ్యంగా వుండి భారతదేశం సుభిక్షంగా వుండాలి, అంతే

బి సూర్యనారాయణ
బందలుప్పి

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

101 పుష్పకుంజ్ ఎ రోడ్ చర్చిగేట్ బొంబాయి-1 (ఫోన్ 243229)

# యువ
## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 5 జనవరి 1962 సంచిక 1

ప్రతి దేశానికీ జాతీయ పర్వదినం అనేది ఒకటి వుంది. ఇలాటి పర్వదినానికి ప్రాతిపదిక ఏమిటంటే, ఆ దేశం పరజాతి పాలననుంచి విముక్తి పొంది స్వాతంత్ర్యాన్ని పొందడమో, లేక స్వాతంత్ర్యానికి వచ్చిన ప్రమాదాన్ని ప్రతిఘటించి విజయం పొందడమో.

ఇలాటి పర్వదినాలు మనకు ప్రాచీన కాలంనుంచీ కొన్ని వున్నాయి. విజయదశమి, దీపావళి పండుగలు, చరిత్ర దృష్టిలో చూస్తే ఇలాటి పర్వదినాలే. కాని, యీ పండుగలకు కారణాలైన సంఘటనలు చరిత్ర దృష్టిలో మరుగు పడిపోయినవి. ఈ నాడు ఈ పండుగలు ఏమిటో, ఎందుకో అనే విషయం మీద భిన్నాభిప్రాయాలు ఉన్నాయి, స్మృతికి అందని ఏవో కారణాల మీద, కేవలం ఆచార సాంప్రదాయాల మీద ఆధారపడి ఏటేటా యీ పండుగలను మనం జరుపుకొంటూనే వున్నాం.

మన జీవిత కాలంలో జరిగిన సంఘటనలను దృష్టిలో పెట్టుకొని సగర్వంగా పండుగ చేసుకోవలసిన ఒక గొప్ప దినం, జనవరి 26.

1950 జనవరి 26 వ తేదీన మన దేశం ప్రజాస్వామిక రాజ్యంగా ప్రకటింప బడింది. ఇది భారత దేశ చరిత్రలో ఇదివరకు ఎన్నడూ జరగని సంఘటన, భారతీయులంతా కూడా అప్రమత్తతతో కాపాడుకోవలసిన ప్రతిపత్తి.

ప్రజలచే ఎన్నుకోబడిన ప్రెసిడెంటు భారత దేశాని కంతకూ పాలకుడుగా వుండగా, ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవనంలో భారతీయు లందరికీ సమాన హక్కులు వుండే రాజకీయ ప్రతిపత్తి భారత దేశంలో 1950 సంవత్సరానికి పూర్వం ఎన్నడూ లేదు.

అనాదినుంచీ భారత దేశపు ప్రజల రాజకీయ జీవితాన్ని గురించి చరిత్రలో మనకు తెలిసినంత వరకు, భారత దేశంలో ప్రజాపరిపాలన ఎప్పు డూలేదు. ఒక్కొక్క ప్రాంతానికి ఒక రాజు, ఆ రాజ్యాన్ని మరొక రాజ్యంలో కలుపుకొని ఏలితే మహారాజు, ఇంకా పెద్ద రాజ్యం సంపాదించిన వాడైతే చక్రవర్తి—ఇలాగ చిన్న, పెద్ద రాజుల పాలనలో భారత దేశ పరిపాలన సాగింది. తరువాత క్రీ శ పదవ శతాబ్దం నుంచీ మహమ్మదీయుల దండయాత్రలలో దేశీయ రాజులు అణగారి పోతుంటే, భారత దేశంలో అక్కడక్కడ నవాబుల పాలన, సుల్తానుల పాలన ఏర్పడింది తరువాత క్రీ. శ. పదిహేడవ శతాబ్దం నుంచీ, ఇంగ్లీషువారు మన దేశంలోకి ప్రవేశించడం, రాజ్యాలను సంపాదించుకోవడమూ, చివరకు దేశాన్నంతటినీ తమ పరిపాలనలోకి తెచ్చుకోవడమూ జరిగింది.

నిజానికి బ్రిటిషువారి పరిపాలనలో తప్ప, అంతకు ముందు ఎప్పుడూ కూడా భారత దేశం అంతటిని పరిపాలన సాగించిన ప్రభుత్వంలేదు. భారత దేశం అంతటి మీదా ఒకే ప్రభుత్వం ఏర్పడినందు వల్లనే, భారతీయులంతా తాము ఒకే జాతి అనే భావాన్ని పెంపొందించుకోవడము జరిగింది. ఒకే జాతిగా నిలబడి బ్రిటీషువారితో పోరాడి భారతీయులు స్వాతంత్రాన్ని సంపాదించుకున్నారు. ఇది భరత ఖండ చరిత్రలో అపూర్వ సంఘటన. ఇలా స్వాతంత్ర్యాన్ని పొందిన దినం, 1947 ఆగస్టు 15 ప్రతి సంవత్సరమూ ఆగస్టు 15, స్వాతంత్ర్యదినం, మనకు ఒక పండుగ.

1947 ఆగస్టు 15 న మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ, మన దేశపు రాజకీయ ప్రతిపత్తి మాత్రం, బ్రిటిషు రాజుకి లోబడిన డొమినియన్. అంటే మన దేశపు పరిపాలనా వ్యవహారాలన్నీ మన అధీనంలోకి వచ్చినా, మన రాజు మాత్రం బ్రిటిషురాజు. ఆయన నియమించే గవర్నర్ జనరల్ మనకు పాలకుడు. ఈ ప్రతిపత్తికి కూడా మనం 1950 జనవరి 26 న ఉద్వాసన చెప్పివేశాము.

1950 జనవరి 26 నుంచీ, మన దేశం సంపూర్ణ స్వతంత్ర ప్రజా రాజ్యం. మనకు రాజు లేడు. మన దేశానికి పాలకుడు, మనం ఎన్నుకున్న ప్రెసిడెంటు. మన ఇష్టం వచ్చిన భారతీయుణ్ణి మనం ప్రెసిడెంటుగా ఎన్నుకోవచ్చు. ఇది, యీ నాటి మన రాజకీయ ప్రతిపత్తి. ఇలాటి అపూర్వమైన ప్రతిపత్తిని మనం ఇదివరకు ఎప్పుడూ కలిగివుండలేదు. అంచేత, యీ ప్రతిపత్తి మన దేశంలో అమలులోకి వచ్చిన జనవరి 26 తేది ఒక గొప్ప పండుగ. ఇదే రిపబ్లిక్ దినం,

కాని, ఆగస్టు 15 తేదిన స్వాతంత్ర్య దినాన్ని గాని, జనవరి 26 న రిపబ్లిక్ దినాన్ని గాని మనం తగినంత ఉత్సాహంతో పండుగలుగా జరుపుకోవడంలేదు. నిజానికి యీ రెండు పండుగలూ దీపావళి కంటె, విజయదశమి కంటె గొప్ప పండుగలు. ఇవి జాతీయ పర్వదినాలు.

ప్రపంచంలోని ప్రతి దేశంలోనూ కూడా ప్రజలు తమ జాతీయ పర్వదినాల నాడు చాలా ఉత్సాహంతో పండుగ చేసుకుంటారు. ఆ నాడు ప్రజలందరూ తమ స్వాతంత్ర్య ప్రతిపత్తిని తలచుకొని, ఆ ప్రతిపత్తికి ఏ ప్రమాదం రాకుండా, తమ స్వాతంత్ర్యానికి ఏ ఉపద్రవం వచ్చినా ప్రతిఘటించి ఒక జాతిగా నిలబడుతామని ప్రతిజ్ఞచేసుకుంటారు,

మనం కూడా మన జాతీయ పర్వదినాలను పెద్ద పండుగలుగా పరిగణించి, దీపావళి, విజయదశమిలనాడు ఎంత ఆనందంతో, ఎంత ఉత్సాహంతో ఉత్సవం చేసుకుంటామో అలాగే, అంత కంటె ఎక్కువగా కూడా, ఉత్సవం చేసుకోవాలి ఈ రెండు పండుగలనాడు ఉదయమే మన దేవాలయాలలోను, చర్చిలలోను విజయ

గంటలు మ్రోగాలి. సాయంత్రం మన దేవాలయాలలోను, చర్చిలలోను, మసీదులలోను ప్రార్థనలు జరగాలి. ప్రతి ఇల్లూ కలకలలాడుతూ వుండాలి. ప్రతి భారతీయుడూ, తన స్వాతంత్ర్య హక్కులను తలచుకోవాలి. ప్రతి కుటుంబమూ పెద్ద పండుగ చేసుకోవాలి. ప్రతి ఊరిలోను, ప్రతి పట్టణంలోనూ పెద్ద సభలు జరగాలి. ఆ సభలలో, అన్ని రాజకీయ పక్షాల నాయకులూ పాల్గొనాలి. పరిపాలనా పద్ధతుల విషయంలో రాజకీయ పక్షాలకు భేదాభిప్రాయాలు వుంటే ఉండవచ్చును గాని, దేశ స్వాతంత్ర్య రక్షణ విషయంలో రాజకీయ పక్షాల మధ్య భేదాభిప్రాయాలు వుండవలసిన అవసరంలేదు; ఉండవు. అంచేత యీ సభలలో వివిధ రాజకీయ పక్షాల నాయకులు తమ పార్టీ విధానాలను గురించి ప్రస్థావన తేకుండా, మన స్వాతంత్ర్య ప్రతిపత్తిని గురించీ, శాశ్వతంగా యీ ప్రతిపత్తిని నిలబెట్టుకోవలసిన అవసరాన్ని గురించీ ఉపన్యసించి, మన మంతా ఒకే జాతి అనీ, మన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవలసింది మనమే అనీ ప్రజలను ఉద్బోధించాలి. అలా చేసినట్లయితే, స్వాతంత్ర్య రక్షణ విషయంలో రాజకీయాలు లేవనీ, అది జాతి అంతకూ సంబంధించిన విధి అనీ ప్రజలలో ఒక స్పష్టమైన భావం ఏర్పడుతుంది. అంతేకాదు, భారత దేశంలోని ప్రజలంతా ఒకే జాతి అనే భావం కలుగుతుంది. ఇలాటి భావం ప్రజలలో శాశ్వతంగా వుండాలి. అప్పుడే మన జాతి ఒక జాతిగా నిలబడి, తన సర్వతోముఖాభివృద్ధికి కృషి చెయ్యడం జరుగుతుంది.

ఈ నెల 26 తేదికి, మన దేశంలో ప్రజా రాజ్యం ఏర్పడి 11 సంవత్సరాలు పూర్తి అవుతవి. ఆనాడు మనం పెద్ద పెట్టున పండుగ చేసుకోవాలి. మన స్వాతంత్ర్య ప్రతిపత్తికి ఆనందాన్ని ప్రకటిస్తూ, మన కర్తవ్యాలను జ్ఞాపకం చేసుకోవాలి.






ఆర్ద్రి స్వభావాన్ని క్రీగంట చూసే రోజులివి ఇటీవల అంటే సైన్సు ప్రభావం ప్రబలిన పిదప హేతుదృష్టి మీద మోజు కలగటం ఆర్ద్రితను నిరసించటానికి కారణం అయింది ఆర్ద్రితను వొక రుగ్మత క్రింద జమ కట్టటం కూడా జరుగుతూ వుంది. బహుశా ఈ రుగ్మత నివారణకు ఈపాటికి మార్కెట్‌కి మందులు కూడా వచ్చివుంటాయి.

ఈ దృష్టి సక్రమమైందికాదు. ఆర్ద్రిత జీవితాలకు శోభను చేకూర్చే గుణాలలో వొకటి అది లేని నాడు మానవ సంబంధాలలో వున్న రమ్యతే నశించి, సంఘం కట్టె పేళ్ళ పోగువగుగా భాసిల్లుతుంది అందుకనే, "నీచాతి నీచమైన భయాల్లో ఆర్ద్రితను గురించి భయపడటం వొకటి'', అన్నాడు ఛస్టర్‌టన్ అనే ప్రఖ్యాత ఆంగ్ల రచయిత.

ప్రస్తుతం ఆర్ద్రి స్వభానికి సిగ్గుపడి దానిని కప్పివేసుకోటానికి మనం ప్రయత్నిస్తున్నాం ఏదైనా విషాద సంఘటనను చూచి మనస్సు కరిగి నప్పుడు, కన్నీరు కనపడకుండా ముఖం తిప్పివేసుకుంటున్నాం. ఈ గుణం కలిగిన వానిని 'అతనిది వొట్టి బీదగుండె' అని నిరసిస్తున్నాం 'ఉత్తి సెన్టిమెన్టలిస్టు' అని తోసివేస్తున్నాం.

కాని ఈ ఆర్ద్రిత అనేదే లేకపోతే, మనిషి సెన్టిమెన్ట్‌ని చిదుముకుంటే జీవితంలో మనస్సుకి ఆహ్లాదాన్నిచ్చే వాటిని అనేకం వొదులుకోవలసి వొస్తుందని మనం మరచి పోతున్నాం. పువ్వులూ, సంగీతం, ప్రేమ, మొదలైనవి లేకుండా ఈ ప్రపంచంలో బ్రతుకవలసి వస్తుంది. అది దుర్భరమే అవుతుంది.

సెన్టిమెంట్ అంటే 'సంసారయుతమైన, సున్నితమైన వొక ఆవేశం' అని

డిక్షనరీ నిర్వచనం చెపుతూవుంది. అటువంటప్పుడు సెంటిమెంట్‌ని వొదులు కోవటం అంటే జీవితం ఏమవుతుందో ఎవరికి వారు ఆలోచించుకోవచ్చు. సెంటిమెంట్ లేకపోతే స్నేహం అనేది వుండదు. ఇరుగు పొరుగుకోసం ఆరాట పడటం అనేది వుండదు. ఏదో వొక స్వప్రయోజనం కోసం కాక కలిసి బ్రత కటం అనేది కుదరదు. ఆ మాటకి వస్తే వివాహానికీ, కుటుంబ జీవితానికీ పునాది కూడా సెంటిమెంటే. "వ్యాపారా నికి గుడ్‌విల్ ఎంత అవుసరమో వివా హానికి సెంటిమెంట్ అంత అవుసరం" అని వొక శాస్త్రవేత్త అన్నాడు. సెంటి మెంట్ లేక ఎన్నో వివాహాలు భగ్నం అవటం మనం చూస్తూనే వున్నాం. టాల్‌స్టాయ్ వ్రాసిన 'అన్నాకేరినీనా'లో కథానాయిక జీవితం చుక్కానిలేని నౌక అవటానికి కారణం సెంటిమెంట్‌లేని భర్తే.

ఆర్ద్రత అవుసరం లేని వివేకం, శక్తి ఈ ప్రపంచంలో ఎవ్వరికీ వుండదు. పైపైకి ఎంత హేతువాద పూరితమైన వాక్పటిమ చూపినా, లోలో పల ఆర్ద్రతకోసం మానవుడు ఎంత తహతహలాడతాడో ఎవరికి తెలి యదు! 'ఈ వంటరి బ్రతుకు నేను బ్రతకలేను' అనే మాట ప్రతి పాత్రా ఎప్పుడో ఒకసారి అంటూనే వుంటుంది. 'మానవుడు శాపదగ్ధుడు.' ఒంటరి తనాన్నుంచి అతడు తప్పించుకోలేడు. అని అస్తిత్వ వాదులు సిద్ధాంతాలు అల్లు తున్నారు.

అటూ ఇటూ కాని మధ్య తరగతి వారే గాని, జీవితాన్ని బహు ముఖాల పరిశీలించిన ప్రజ్ఞా ధురీణులెవ్వరూ సెంటిమెంట్‌ని నిరసించలేదు. ఐన్‌స్టీన్ ఎంత ప్రముఖ శాస్త్రవేత్త అయినా ఫిడేలు రాగాలాపన అతని మనస్సును ద్రవింప జేస్తూనే వుండేది. తన చిన్న నాటి స్నేహితురాలు అతి మూత్ర వ్యాధి వల్ల చనిపోవటం వల్ల కలిగిన వేదనా ఫలితంగానే డాక్టర్ ఫ్రెడరిక్ బాన్టిన్ 'ఇన్సులిన్' కనిపెట్టాడు. శంకరుని వంటి విజ్ఞాన తత్వవేత్త సర్వసంగ పరి త్యాగి అయినప్పటికీ, తల్లి రోగ పీడిత అయి వుందని వినగానే ఆమె మరణ శయ్య దగ్గరకు పసిపిల్లవానివలె పరుగె త్తాడు. ఎమర్సన్ తన భార్యసమాధిని రోజుకు వొక్క సారైనా దర్శించుకు వస్తూ వుండేవాడు.

ఒకప్పుడు అమెరికా ప్రెసిడెంట్ రూజ్వెల్టు సతి "నా ఆలోచన వొక

విధంగా చెపుతూవుంది. నా హృదయం మరొక విధంగా చెపుతూవుంది. నన్నేం చెయ్యమంటావు?" అని బెర్నార్డ్ బరూచ్ ని సలహా అడిగితే ఆయన "అనుమానం కలిగినప్పుడల్లా మెదడును కాక హృదయాన్ని అనుసరించటమే మంచిది. అది తప్పయినా ఎక్కువ విచారానికి గురికావలసిన అవసరంలేదు" అని చెప్పాడు.

ప్రముఖుల దృష్టి ఈ విధంగా వున్నప్పుడు, సెంటిమెంట్ని చూచి మనం ఎందుకు భయపడాలి? మనం జీవితాన్ని ముక్కలు ముక్కలుగా చూడటమే దీనికి కారణం అని నేను అనుకుంటాను.

సెంటిమెంట్ తరిగి పోవటానికి మనస్సు తెచ్చి పెట్టుకున్న అలవాట్లే కారణం. పసి పిల్లకు సెంటిమెంట్ చాలా ఎక్కువగా ఉంటుంది. తల్లి వొడిలో పొరలాడటం ఆమెకు అమిత ఇష్టం. రాసుకొని పూసుకొని తిరగటం ఇష్టం. తనను ఆప్యాయతగా పిలిచిన వాళ్ల దగ్గరకు రంయినీ పరుగెత్తుతుంది వాళ్లు ఎటువంటి వాళ్లు అనే ప్రశ్న పసి పిల్లలకు వుండదు. అది పెద్ద వాళ్ళ చేష్ట.

అసలే ఈ రోజుల్లో జీవితం యాంత్రికం అయిపోతూ వుంది. పుట్టటం, చావటం రెండే జ్ఞాపకం ఉంటూ వున్నాయి. పుటకా చావుకంటే ముఖ్యమైంది బ్రతుకనే విషయం మనం మరచిపోతున్నాం. నడిచిన దారి వెంటల్లా పూల మొక్కలను నాటుకుంటూ వెళ్తేనే ఈ ప్రపంచం వాస యోగ్యం అయినట్లు. హృదయం నిరసించబడి ముడుచుకు పోవడం వల్ల ఈ పని జరగదు. హృదయం మాట్లాడాలి. సెంటిమెంట్ అనేది ఎడారి బ్రతుకులకు ఒయాసిస్ వంటిది. జీవితం వొరిపిడిలో నలిగి పోతున్న మనుష్యుల్ని పన్నీటి జలక మాడిస్తుంది. మోడు బ్రతుకులకు సుగంధ పరిమళాలను తాపడంచేస్తుంది.



అప్పుడు




ఇప్పుడు




ఫిఫ్తు ఫారం మొదలు బియ్యస్సీదాకా ఒకేచోట కలిసి చదువుకొని బ్రతుకు తెరువుకోసం ఎవరి మటుకు వాళ్లు విడిపోయినా రవణమూర్తి, రామ్మూర్తుల మనస్సులు మాత్రం ఎప్పుడూ కలుసుకుని కబుర్లు చెప్పుకుంటూనే ఉంటాయి అందుకనే ఒక మూర్తి ఈ లోకం నుంచి తప్పుకున్నా రెండవ మూర్తి లోకంలో మాత్రం ఆ మూర్తి

స్ఫూర్తి ఎప్పటికీ కళకళలాడుతూనే ఉంటుంది అలాంటి ఒక సందర్భంలో రవణమూర్తి ఓసారి స్నేహితుడి కొడుకుని చూడ్డానికి వచ్చాడు.

'ఇదిగో అలా నువ్వు కంట తడి పెడితే నేను రాకనే పోదును. మామూలు రకం పరామర్శలకయితే రోజులు దాటకుండానే వచ్చి ఉందును మూడు నెలలు దాటేక రావడమెందుకూ?'

రవణమూర్తి గోపాలం చెయ్యి మొహం నించి బలవంతంగా అడ్డు తీసేశాడు. గోపాలం రెండు కళ్లల్లోంచీ కన్నీళ్లు కాలవలు గట్టేయి 'ఓహో' అంటే ఓహో అనుకునే స్నేహితులు వందల కొద్దీ ఉన్నా మనస్సు విప్పి చెప్పుకునే వారు ఏ ఒకరో యిద్దరో ఉంటారు నెల్లాళ్లకి ఒకమారయినా మా గురించి వింటేనేగాని నాన్నగారికి తోచేది గాదు బాబాయిగారూ! మిమ్మల్ని చూస్తూంటే నాన్నగారు జ్ఞాపకం వచ్చి నా మనసు మరీ కెలికేసినట్లు అవుతోంది'

'అబ్బే, అదేవిటి బాబూ బొత్తిగా చిన్న పిల్లాడిలా. ?'

'లేదు నేను చిన్న పిల్లాడిని అనుకునే వారింకెవరూ లేరు చీరలూ నగలూ యిచ్చే మొగుణ్ణి మా ఆవిడకి నేనున్నాను బిచకత్తులూ, పిప్పరమెంతు బిళ్లలూ తేచ్చే నాన్నని మా పిల్లలికి నేనున్నాను. నాకెవరున్నారు? మనమల్ని ఎత్తగల వయస్సున్న కొడుకయినా సరిగ్గా తింటాడో లేదో అని భోజనం దగ్గర విసనకర్రతో ప్రత్యక్షమయే తల్లి నాకు ఏనాడో కరువయింది .కొండంత నీడ . ఆకాశమంత అండ .మా నాన్న కూడా నాకు లేకుండా పోయాడు... ఇంక నా కెవరున్నారు? గోపాలం వెక్కి వెక్కి ఏడ్వ నారంభించాడు. విడదీసిన కొద్దీ దెబ్బలాట ఎక్కువైనట్టు— తవ్విన కొద్దీ గొయ్యి పెద్దదైనట్టు— అనునయించిన కొద్దీ విచారం ఎక్కువౌతుంది అందుకనే అనుభవం గల రవణమూర్తి గదిలోకి వెళ్లి పుస్తకాలన్నీ వెతికి 'హేమ్లెట్' పట్టుకొచ్చాడు పుస్తకం అటూయిటూ తిప్పి ఒక పేజీ దగ్గర ఆగేడు 'ఇది నువ్వు చదివావుగా బాబూ! తండ్రిని కోల్పోయి సర్వస్వాన్నే కోల్పోయినట్టు బాధపడే 'హేమ్లెట్'కి చెప్పినట్టు చెబుతూ షేక్స్పియరు మానవాళికి అందించిన మహత్తర వాక్యాలు చూడు '

గోపాలం ఆశ్చర్యంగా ఆవాక్యాలు చదివేడు. సద్గ్రంథాలకీ జీవితాలకీ అంత సామీప్యం ఉంటుందని అత నెప్పుడూ అనుకోలేదు

ఆ వాక్యాల సారాంశం యిది : 'ఇందులో కొత్తదనం గాని విచారించవలసింది గాని ఏముందీ? నీ తండ్రి తన తండ్రినీ-ఆయన వాళ్ల తండ్రినీ....

అలా.... ఎందరో వాళ్ల తండ్రుల్ని కోల్పోయారు...నువ్వినాడు నీ తండ్రిని కోల్పోవడం అతి సహజం. ఇందులో వింతే మున్నది? చింతే మున్నది? ప్రకృతి సూత్రం అంతే నన్నది!'

గోపాలం పుస్తకాన్ని ఆ పేజీ దగ్గిర విరచి అలాగే టేబిలు మీద పెట్టేడు. ఆ మధ్య మొహం పెట్టి కళ్లు మూసుకున్నాడు.

*   *   *

గోపాలం యింకా యింటికి రాలేదు. రవణమూర్తి ఒక్కడూ గదిలో అటూ యిటూ పచారు చేస్తున్నాడు. అతను ఆ యింట్లో చూసిన రామ్మూర్తి తాలూకు వస్తువులు - పొడుంకాయ, పైరుజోడు, రోల్డ్ గోల్డ్ ఫ్రేం కళ్లజోడూ, చిన్న వివేకానందుడి ఫొటో - యిలాంటి వాటి కన్న....అతని జ్ఞాపకాలూ-ముఖ్యంగా నిర్లిప్తతా, సంతృప్తీ, హాస్యం, మేళవించిన అతని చమత్కార సంభాషణలూ-రవణమూర్తిని కదిలించాయి.

'వెధవ పిల్లి, పాలన్నీ ఎలా పారబోసిందో'.

'బాగుంది, గిన్నెలోనే ఉండి వేడిగా ఉంటే అదెలా తాగ గలదు మరి? అన్ని పాలూ మనమే ఊన బడితే దాని కడుపు నిండేది ఎలా? అయినా నేడో రేపో యీనేట్టుంది కూడాను.



"వాట్ ఈజ్ దిస్ మిస్ చంచలా? 'రా. సుబ్రమణ్యం అని టైపుచేయ మంటే పో. సుబ్రమణ్యం' అని టైపు చేశావ్?"
"అది డిస్మిసల్ లెటరే గదండీ!"

'అదేవిటీ, దేవుడికి లేకుండా ఆ పువ్వులన్నీ ఊరూ వాడా పంచిపెట్టేస్తున్నారా, ఏం మనుషులమ్మా?'

'బాగుంది, మూడోంతుల మంది దేవుళ్లు పువ్వుల్లో పుట్టిన వాళ్లే.... వాళ్లకి మళ్లీ అవే యిస్తే బాగుంటుందా మరి?'

'రామం, మొన్న బస్సులో వస్తూంటే నీ పర్సు పోయిందిట, పాపం?'

'బాగుంది, అందులో ఉన్నదెంత గనక? పాపం ఓ పూట ఓ కుటుంబాని కయినా కడుపు నిండేనో లేదో... అయినా నాలాంటి అజాగర్త పరు

ల్నందర్నీ ముందు జైల్లో పెడితే దేశంలో దొంగతనాలు తగ్గునేమో!'

'ఏవఁడీ చూశారా, నల్లెలా అంట బొడిచేసిందో ...ఎంత దద్దు రెక్కిపో యిందో!'

'బాగుంది జడ్జీగారి కూతుర్ని నల్లి పిల్ల కుట్టడమే? అంత బొత్తిగా భయం భక్తి లేకుండా పోయిందా? దొంగ రాస్కెల్, ఈ మారు కనబడనీ కను క్కుందాం!'

'పాపం, కోడలు యింటికి వచ్చే వరకైనా మీ ఆవిడ బతక లేక పోయింది....'

'బాగుంది....కోడలు యింటికి వచ్చేక సుఖంగా బతికిన అత్తగారు ఎవరు గనక? ఒక వేళ యీావిడ సుఖంగా బతికితే ఆ కోడలు జీవించేది ఎన్నాళ్లు గనక?'

'ఇంటింటా తిరుగుతూ యిలా కబుర్లు చెబుతూ ఎన్నాళ్లని తిరగ్గలవు తాతయ్యా?'

'బాగుంది....పిలుపు వచ్చే వరకూ ఆగ కేం చేస్తాం? ఇంకా మా అమ్మకి దయ కలిగినట్టు లేదు మరి!'

* * *

బాగుంది... జీవితం యింత బాగున్న వాళ్ళకి మరణం కూడా మరింత బాగుండ కేం చేస్తుంది? కలిగి ఉన్నా కళ్లు కలగని మనిషికి—మంచం మీద ఉన్నా మంచి ముత్యంలా గడి పిన మనిషికి—పంకంలో ఉన్నా పద్మంలా వికసించిన మనిషికి—ఆఖరి కాలం కూడా అందంగా ఉండకేం జేస్తుంది? సూర్యాస్తమయం కూడా సుందరంగా ఉండడంలో వింత ఏముంది? అన్నీ సద్దుకుని సరిదిద్దుకుని రైలు ప్రయాణానికి వెళ్ళినంత ఉత్సా హంగా వెళ్ళిపోయాడు రామ్మూర్తి.

రమణమూర్తి పై గొంతుతో కళ్ల నీళ్లు తుడుచుకున్నాడు. క్రిందటేడు తను రామ్మూర్తిని చూడ్డానికి యీ ప్రాంతాలకి వచ్చినపుడు ఒకమారు ఏంజరిగిందనీ....

తియ్యని మాటలేకాక తియ్యని మాత్రలు కూడా యివ్వడం వాడికి అలవాటు. ఇంట్లో వాళ్ళకీ, తెలిసిన వీధిలో వాళ్ళకీ, ఎరిగిన ఊళ్ళో వాళ్లకీ సాయం చెయ్యడంలో పెద్ద ఆశ్చర్య మేమీఁ లేదు. ఆ రోజు తనూ రామ్మూర్తీ ఇలా గుమ్మం దిగి వీధిలో అడుగు పెట్టేరో లేదో....'ఏం బాబు బత్తాయి పళ్లు మంచి వున్నాయి—ఏవైఁనా పడ తాయా యేటి' అంటూ పళ్ళమ్మి ఎదురొచ్చింది. దాని నెత్తిన ఉన్న పళ్ల గంపకన్నా అది చంకనెత్తిన గయ్యాళి గంపే రామ్మూర్తిని ఎక్కువగా ఆకర్షించింది.

'ఈ గుంటని తీసుకెడితే యింక నువ్వు పళ్ళు అమ్ముకున్నట్టే....నీ కేక

కన్న దాని ఏడుపే బాగా వినిపిస్తోం దేఁవేఁ?'

'ఎందుకేటి బాబూ, నాల్రోల మట్టి బొట్టి మూసిన కన్నెరగదు. ముండ నన్నొగ్గదు, నోరు కట్టదూ... నా నేటి సెయ్యాను సొప్పండి?'

'చెబుతా.... ముందా గేటుతలుపు వేసి లోపలికిరా....'

రవణమూర్తి అడ్డు బడ్డాడు.

'ఒరే మనం రైలుకి వెళ్దామను కున్నాంగా....మధ్యని ఈ పేటా షన ఏవిఁటీ?' రామ్మూర్తి మాట వినిపించు కుంటేగా....లోపలికి వెళ్ళి పొట్లాలు కట్టి తీసుకొచ్చాడు.

'చూడూ ఈ మాత్రలు దీన్నేత మింగించు. ఈ ఎఱ్ఱ పొట్లం చీకటి పడ్డాకా, ఓ రాత్రి వేళ ఈ తెల్ల పొట్లమూ.... ఈ విధంగా మింగించు'

'గొప్పోళ్ళు .... గొప్ప మనసు గలోళ్లు, కొత్త కొత్త కోడళ్ళు కలిగి, గొప్ప గొప్ప లోగిళ్లు కలిగి...'

'ఆఁ అలా గలాగేలే. ఈ రెండ్రోజులూ తిరుగుళ్లు ఆపు...పణ్ణర్ధం దాటని వెర్రిముండని ఎండలో తెగతిప్పి బరికిందని బజాయించుకు. ఈ బియ్యమూ, ఈ పావలా డబ్బులూ పటిగెళ్లి రేపూ ఎల్లుండీ కాలక్షేపం చెయ్యి...రెండ్రోజులపాటు ఇంటి పట్టున ఉంటేనే గాని మళ్ళీ నీ బుల్లి నీది కాదు. తెలిసిందా?'



చూశావా అమ్మా! మామాస్టరు నాకు తలకాయ లేదంటున్నాడు.

'మా అమ్మే, నా బాబే...ఎంత సల్లని యేల ఎంత సల్లని తల్లి నిన్ని బూ మాలచ్చి కిచ్చిందో.... బాబ్బాబు సెమించాల...ఎంచుబడి కాయలన్నీ అమ్మేసుకున్నాను....దిక్కుమాలిన ముండని నా కాడేంలేదు. ఈ కాయ లుంచు బాబో....'

'అలాగే పిల్లదానికి తొనలు తీసి తినిపించు...నేనే తీసుకుందును గాని యింట్లో చెట్టే ఉందిలే...అడ్డులే.... అవతల నాకు పనుంది....పదరా రవణీ....దీ నొక్కర్తితో కూచుంటే అయిపోతుందా యేవిఁటి? అవును.... విశ్వమానవ సౌహార్ధ్రమూ, విశాల దృక్పథమూ ఉన్నవాళ్ళకి ఒక్కరితో

కూచుంటే అయిపోతుందా? ఒక్క 'పని' తో సరిపోతుందా? అందుకే ఆ వయస్సు అయీ అవగానే పదవీ విరమణ చేస్తే అందరికీ ఆశ్చర్యం కలిగించింది

'అదేవిటీ, మీరు విశ్రమిస్తామంటే మాత్రం మేం ఒప్పుకుంటామా ఏవిటి? మీలాంటి 'సిన్సియర్ వర్కరూ', 'కేపబుల్ హేండూ' మళ్ళీ మాకు దొరకద్దూ? ఏదో రూలు కోసం రిటైరు అవడాని కింత వయసని ఏర్పరిచారు గాని రెండుసార్లు రిటైరు అవడానికి సరిపోయిన వయసుతో ఎంతమంది ఉద్యోగాలు చెయ్యడం లేదు? అసలు ఓ చెంప నెరవడమే ఈ దేశంలో నాయకత్వానికి కావలసిన క్వాలిఫికేషను గదా ' అని చెప్పి చూశాడు పై యజమాని 'అందుకని అందుకని చచ్చే దాకా డబ్బు సంపాదించడమే పరమావధిగా పెట్టుకోమంటారా? భవిష్యత్తుమీద గంపెడాశతో ఉద్యోగం కోసం భర్తని పంపించి వీధిలో అతని కోసం ఎదురుచూసే – పచ్చని పడుచు కడుపులో చిచ్చు పెట్టమంటారా? వద్దు బాబూ వద్దు డబ్బు యిచ్చే సుఖంకన్న అది అరాయించుకోడంలో కలిగే అజీర్తే ఎక్కువ'

ఆఫీసర్లనీ, ఆడిటర్లనీ మేపడాలు, పన్నుల ఎగవేతలూ, ఎకౌంటు సర్దుబాట్లూ వీటితో కొట్టుకుపోతూ కంటి మీద కునుకు ఎరగని పాపిష్టి పనులతో రామ్మూర్తి లాంటి వారి కెలా ఉంటుంది యింకా యింకా ముడి? పువ్వులతో మేలుకొని పిల్లలతో ఆడుకుని పక్షులతో పడుకునే ఆయనకి జీవితంలో అందని దంటూ ఏనుంటుంది? పొద్దుటే ఆయన లేవడం చూసుకుని సూర్యుడు ఉదయించే వాడేమో ఆయన పనిమనిషికీ, పాలవాడికీ జీతాలు యిచ్చేరోజున అది ఒకటో తారీకని అందరూ గుర్తు పెట్టుకొనే వారేమో ... ఆయన ఏదైనా జవాబు రాస్తూంటే అంతకు ముందు అరగంటలో ఆయనకి ఆ ఎడ్రసు నుంచి ఉత్తరం వచ్చి ఉండాలని తెలుసుకునే వారేమో ...

మొగాళ్ళయితే జబ్బలనూ ఆడాళ్ళయితే చీరలనూ ప్రతిక్షణం చూసుకుని మురిసిపోతూ ఉంటారు. అసలు అద్దాల ముందు అతుక్కుపోడానికే ఎక్కడలేని టైమూ చాలదు...ఇంకా ఏమైనా టైం మిగులితే తనకన్న అన్నివిధాల తక్కువ వాళ్ళని చూసి తమ గొప్పలను చెప్పుకుంటూ ఉంటారు 'ఏ వంటావు, నేను చెప్పింది సరైన దవునా కాదా?' అని అడుగుతూ ఉంటారు. 'మీరు సెల వియ్యడం మరోలా జరగడమూనా?' అనిపించు కుంటూ ఉంటారు. వారానికి మూడుసార్లు తలంటుకొనే అత్త

గారి కయినా, అయ్యో అంత శ్రద్ధ లేకపోతే ఎలాగమ్మా మీకూ? నెల యిందిగదా తలంటుకుని .. పదండి యీ పాటికి యింత నూనిచుక్క పెడ తాను' అనేకోడలు కావాలి. రెండు వారాలకుగాని ఒక జత బట్ట మార్చని ఆఫీసరుకయినా 'అదేవిఁటో, మీ దగ్గ రకి వస్తే యిదీ అని వర్ణించడానికి వీల్లేని పరిమళమూ' నిర్మలత్వమూ వెల్లివిరుస్తాయి సుమండీ చెప్పకేం' అనే అసిస్టెంటు కావాలి ఊళ్ళో అమ్మిన గైడ్సూ ఎవరో చెప్పిన నోట్సూ దగ్గిర పెట్టుకోంఁడే పాఠం చెప్పలేని టీచరు కయినా 'అరటిపండు ఒలిచి చేతులో పెట్టడం అనడం విన డమేగాని అనుభవించ లేదు. ఇదే కాళోలు' అనే శిష్యుడు కావాలి

ఎంతసేపు తన వర్ణనా, తన ఓర్పూ, ఇంతకు మించి ఆలోచించ డానికి తైమేది? ఇంకా ఏమైనా మిగిత్తే సంసార తాపత్రయంలో మునిగి తేలడానికి ఒక్కొక్కరికి రెం డేసి జన్మలు చాలవు. అవతల వాళ్ల గురించి తన ఆలోచన ఎప్పుడూ ఉండదు ఒకవేళ ఉంటే ఆ పద్ధతే వేరు.

'ఏదో పనున్నట్టు మా గోడెక్కి ఊఁ అరవకపోతే, ఒసే కాకీ, నీ పాం డిత్యం ఎదురింటి రవణమ్మగారి దగ్గిర



"మీరు చెల్లని అణా ఇచ్చారు బాబయ్యా."
"నీ నిజాయితీ మెచ్చుకోదగినది, నువ్వే అట్టే పెట్టుకో!"

వెలగబెట్టకూడదు ఛే' అనుకోనివాళ్లూ.

'పక్కింటి మోహనరావుగారి యింట్లోనే ఒక కట్టకి కట్ట ఉత్తరాలు దిగెయ్యకపోతే-నీ కొచ్చిన యేళ్లకి, పక్షపాతపు బుద్ధి కాకపోతే — మా యింట్లో కూడా ఓ శుభ రేఖ విసిరితే- నీ నిక్షేపం తరిగి పోతుందా ఏమి టయ్యా పోస్టుమేనూ?' అనుకోని వాళ్లూ అరుదు -అందుకే ఆశ్రయింపు లకే జీవితం అంకితం చేసి దేశంలో చరిత్రలో పెద్దపెద్ద స్థానాలు కల్పిం చుకునే వాళ్ల రొదలో - సరళ జీవను లైన సామాన్యుల కథ వినిపించడమూ వికసించడమూ కూడా అరుదే

* * *

'ఏమిటి యీ ఆలోచనలు తాడూ బొంగరం లేకుండా ?' అనుకున్నాడు రమణమూర్తి. వెనక్కి తిరిగిచూశాడు. ఎంత సేపయిందో గాని గోపాలం వచ్చి కూచున్నాడు.

'ఏమయినా అదృష్టవంతుడ వయ్యా గోపాలం నువ్వు.... మీ నాన్న దేవుడు గాని మనిషి కాదు బాబూ....మీ నాన్న చివరికాల మంతా....అందరి కంటె ఎక్కువగా నీ దగ్గిరే గడిపేడు....ఇంతటి సత్సాం ప్రదాయం ఊరికే పోదు బాబూ'

'నేనూ అలాగే అనుకున్నాను.... కాని ఆలశ్యంగా పోల్చుకున్నాను.... నేను అన్ని విధాలా అన్యాయమై పోయాను'.

రమణమూర్తి ఆశ్చర్యంగా గోపాలం వైపు చూశాడు.

'అవును....మీ ముందు నాకు దాప రికం లేదు. మనసు విప్పి చెప్పుకోడానికి కూడా మీ కంటే నాకింకెవరూ లేరు. ఉన్న ఊరినీ, కన్న వారినీ ఒదిలిపెట్ట లేక స్కూలు ఫైనలు ప్యాసవగానే ట్రెయినింగు అయిపోయి ఈ ఊళ్లోనే హైస్కూల్లో టీచరుగా స్థిరపడి పోయానని మీకు తెలుసు. నా సర్వీ సంత వయస్సులేని మా పెద్ద కుర్రాడు ఎల్.సి.యీ. ప్యాసై నూటయాభై తెస్తున్నాడు గాని నా జీతం నూరు దాటలేదు. అడిగిన వాడికి లేదనని మా నాన్న వచ్చే జీతంలో ఏదో పెద్ద ఆస్తి మిగులుస్తాడని నా కెప్పుడూ ఆశ లేదు. ఇంత డబ్బు నిలవ చేద్దామన్న ఆలోచన మీద ఆయనకి ధ్యాస ఉన్నట్టు నా కెప్పుడూ తోచ లేదు. ఆయన స్నేహితు డొకడు చేయించిన యిరవై వేల లైఫ్ పోలసీ మీద మాత్రం అందరితో పాటు నా కళ్లూ ఉండేవి. అది ఆయన మొదట్లో ఎవరికీ 'ఎసైన్' చెయ్యలేదు. ఇంటి పట్టున ఉన్న వాణ్ణి గనక-ఉన్న వాళ్లలో పిల్లలు ఎక్కువా, సంపాదన తక్కువా అన్న దాంట్లో ఫస్టు మార్కు నాది గనక - కనీసం అందులో ఓ పదివే లయినా నాకు ముట్టచెబుతారని ఆశిం చాను...కాని....జరిగిందేమిటో మీకు తెలుసుగా బాబాయ్‌గారూ ?'

'తెలుసు....వాడు దాన్ని సం స్కృత పాఠశాలకు రాసిచ్చాడటగా'

'మీ కిది సబబుగానే తోచిందా?..'

'....సరేలే...చెప్పు చెప్పు'

'ఇంకేం చెప్పేది? చెట్టంత నాన్నతో పాటు కొండంత ఆశ కూడా నేల కూలి పోయింది. మా నాన్న నాకే మిచ్చారో మీకు తెలుసునా ? చెప్పు దెబ్బలు !'

'చెప్పు దెబ్బలా ?'

'అవును, నాలాంటి నిర్భాగ్యుడికి అంతకన్న లభించేవి ఏమున్నాయి ? అప్పు డందరూ యింటికి వచ్చినప్పుడు

ఎంతో దగ్గిర వాళ్లు కూడా ఎంతలేసి మాటలాడేరో మీరు ఊహించలేరు. ఆ రోజున ఎంచేతో నాకు జ్ఞాపకం లేదు, అదే పిల్లలూ యింట్లో లేరు... అవాళ కొంచెం తల నొప్పిగా ఉంది. మామూలు టైం కన్న ముందుగానే నేను యింటి కొచ్చేశాను. నేను రావడం వాళ్లు చూసినట్టు లేదు. ఎవరో అంటున్నారు.

'అలాంటి మహాత్ముడికి అన్నం పెట్టే అదృష్టం యింత మంది బలగంలో ఈ కోడలికే దక్కింది. ఇంతకీ ప్రాప్తం!'

'ఆఁ, ముప్పై ఏ రూపాయలు పారేస్తే వంట మనిషి దొరక్కపోయిందా ఎవ్విటి గాని.... అయినా నాకు తెలీక అడుగుతానూ, నెలకి మూడొందలు పెన్షను తెచ్చి యిల్లు నింపే మావఁగారు ఎవర్తికి చేదే?' అని జవాబు చెప్పింది మా పెద్దొదిన గారు. 'అయినా వెంటనే కాచుకుని పెద్ద డాక్టరు చేత వైద్యం చేయిస్తే నాన్న దక్కునమ్మా! ఆయన దగ్గర తినడమంటే అందరూ సిద్ధంగాని, పెట్టడమంటే అందరికీ కష్టమే కదుటమ్మా' అని రాగాలు పెట్టింది మా చెల్లెలు.

'ఎంత దానం చేసే మనిషయినా ఇంట గెలవక రచ్చ గెలిచేంత అవివేకి కాదు మా నాన్న.... దగ్గిరుండి ఏళ్ల తరబడి తిన్నది చాలక ఈ గోపాలంగాడు ఏం ప్రాణం విసిగించాడో,



" దాసుగారూ మీ దగ్గర ఎన్నాళ్ళున్నా ఏం ప్రయోజనం లేదని తెలిసింది అందుకని రిజైన్ నిస్తున్నాను."

ఆయనకి ఒళ్లు మండి అలా రాసిపారేశారు. మొత్తమ్మీద ఎవరికీ ఏం లేకుండా చేసేగాని వాడి కళ్లు చల్లబడ్డాయి కాదు' అన్నాడు మా చిన్న తమ్ముడు! మా దొడ్డమ్మ అందుకుంది, 'అది కాదు గాని నామాట కాస్త వినండి. మీరందరూ ఆ మహాపట్నాల్లో వందలకి వందలు తెచ్చుకుని మహా సుఖపడుతున్నారనే అక్కసుకొద్దీ అదే యింత పని చేయించి ఉంటుంది. ఉన్నన్నాళ్లూ ఆ మహానుభావుడికి ఓ పూట పెట్టీ పెట్టకా ఆ జాణ పుట్టింటికీ పాటికి ఎంత జేరేసుంటుందో! దానికి లెక్కా పద్దూ అంటూ ఉన్నాయా యేమిటి?"

"విన్నారా బాబాయి గారూ నాకు మిగిలిందేవిఁటో.... ఇందులో ఇంకోరు అసూయ పడ్డానికి కూడా ఉందా? మానాన్న నాకేమిచ్చాడు?"

రమణమూర్తి చిరునవ్వుతో గోపాలం వైపు చూశాడు. ఆకళ్లల్లో కాంతులు చూసి అతడు ఆశ్చర్య పోయాడు,

'ఇంతకన్న నీకు మీ నాన్న యింకే మివ్వాలి గోపాలం? ఎంతో పూర్వ పుణ్యం చేసుకున్న వాళ్ళకి గాని యిలాంటి ఆస్తి లభించదు. ఎవరో ఎందుకు, నీ సంపద చూసి నేనే అసూయ పడుతున్నాను!'

'అదేవిఁటి? నాతో మీరు హాస్య మాడుతున్నారా?'

'లేదు ... నీముందున్న చీకటిని తొలగించడానికే ప్రయత్నం చేస్తు న్నాను. గట్టునే చూస్తే గంగలో నీళ్ళైనా కలక బారినట్టే కనిపిస్తాయి. పై పైన కొలిచే నిర్ధారణ చెయ్యడం న్యాయమా గోపాలం? మావాళ్ళంతా డబ్బుతోచే మనుషుల మంచి చెడ్డలు కొలిచే మర మనుషులయి పోయారు. అదే జీవనం అనుకున్న వాళ్లు అదే లేకపోతే అసలుస్వరూపం బయటపడి — బయటపడ్డ చేపల్లా బాధ పడి పోతారు.... అందుకనే వాళ్ళు అలా విమర్శించడం చాలా సహజంగా ఉంది. కాని డబ్బు సంపాదించినా దానివల్ల చెడిపోయినవాడు కుటుంబం మొత్తంమ్మీద మీ నాన్న ఒక్కడే.... ఆయన నీడలో మీ అన్నదమ్ములందరి కన్న ఎక్కువకాలం నువ్వు గడిపేవు.. నీ నుంచి మాత్రం యిలాంటి మాటలు నేను 'ఎక్స్పెక్టు' చెయ్యలేదు.

'అదేవిఁటి....'

'అడ్డురాకు .... నన్నలా చెప్పుకు పోనీ .... నిన్నపొద్దుటకదూ నేను మీ యింటికి వచ్చాను — వస్తూనే నేను చూసిందేమిటో తెలుసా? నీ పిల్లలు అప్పటికే స్నానాలు కూడా చేసి చక్కగా తలలు దువ్వుకుని గడగడ చదువుకుంటున్నారు. మీ ఆవిడ కుంపటి దగ్గర కూచుని ఎండ చేత్తో ముక్కలు వేయిస్తూ కుడి చేత్తో ఒళ్లో పెట్టుకున్న మడిచిన పేపర్ని అటూ యిటూ త్రిప్పుతూ చదువు కుంటోంది. నువ్వు గదిలో కూచుని కాంపోజిషను పుస్తకాలో ఏవో దిద్దుకుంటున్నావు. నేను వాచీ చూశాను. ఆరయింది! అవును.... ఇందులో ఆశ్చర్య పోడానికేముంది .... ఇది మన రామ్మూర్తి యిల్లు మరీ, ఇంకోలా ఎలా ఉంటుంది? అనుకున్నాను....

గోపాలం, సాధారణంగా కాలేజీలు పదింటికి తెరుస్తారని నీకు తెలుసుగా.... అందరూ కాదుగాని చాలా మంది విద్యార్థుల దినచర్య చెబుతా విను.... పతొమ్మిదిన్నరకో లేస్తారు...



"ఒరే బాబూ ! నాయన దగ్గరికి పోమాకు ఇవ్వాళ ! వారికి కాంగ్రెస్ టిక్కెట్టు దొరికి నట్టు లేదు !"

వెంటనే శుభ్రమైన యిస్త్రీ జత ఒకటి తొడిగేస్తారు..ఎడం చేత్తో పుస్తకాలూ కుడిచేత్తో పళ్లుదోము పుల్లా, పట్టుకుని కాలేజీకి వచ్చేస్తారు...ప కాలేజీ కయినా అతి దగ్గిరలో ఒక కాఫీ హోటలూ మంగలిషాపూ తప్పవు. కావలిస్తే చూడు. ప కొళాయిదగ్గిరో దంతదావనం అయిందనిపించి మంగలి షాపులో మేకప్ అవుతారు... హోటల్లో 'లోడ్' వేసుకుని యివతల పడేసరికి ఫస్టుబెల్ ఎలాగా అవుతుంది.

'ఇదెందుకు చెబుతున్నానంటే దిన దిన పతనమై కృత్రిమమై పోతున్న సాంఘిక వ్యవస్థను గమనించిన నా కళ్ళకి మీ యిల్లు చల్లని పందిరిలా కనిపించింది బాబూ'

రవణమూర్తి ఒక్కనిమషం ఆగి మళ్ళీ మొదలెట్టాడు.

'మధ్యాహ్నం ఓమారు పడుకుని లేచే సరికల్లా మరో మనోహర దృశ్యం నా కంట పడింది. మీ అమ్మాయి పెద్దది కాబోలు, బిందెతో నీళ్ళు తీసు కోస్తోంది. వెనకాల అబ్బాయి రాగి చెంబుతో నీళ్ళు తెస్తున్నాడు. నన్ను పులకింప చేసింది ఇవేవీ కావు. నీళ్ళ వెనుక మీ చంటిది ఎట్టాటి లక్క పిడత నిండా నీళ్ళుపోసి తలమీద పెట్టుకుని రెండు చేతులూ పైకెత్తి అతి పొందికగా, ఒక్క-చుక్క నీళ్లు పడిపోకుండా తీసుకొస్తోంది.

'ఇదెక్కడ్నించేవ్ గొల్లభామా ' అని నేను పలకరిస్తే ఆ ఆరిందా అంటుందీ...

'బాంది...ఎవరింట్లో నీల్లు వాల్లు తెచ్చుకోలూ ?'

మీ పెద్దమ్మాయి చెప్పింది, అవాళ మీయింట్లో దాసీది రాలేదుట. దాసీ దంటే జ్ఞాపక మొచ్చింది...పరాధీనతలో పతాక నందుకున్న మా కుటుంబంమాటే చెప్పాలి.... మా యింట్లో దాసీదీ, మొక్కలకు నీళ్లు పోసేదీ, మంచినీళ్ళు పోసేదీ, పక్కలు ఎత్తేదీ, బజారు కెళ్లేదీ—ఇన్నిటికీ యింత మంది నౌకర్లూ ఉన్నారు. నీతో చెప్ప కేం మా యింట్లో ప్రతి ఒక్కరికీ; కనుక్కోడానికి ఒకరూ, పొగడ్డానికి ఒకరూ కనీసం యిద్దరేసి మనుషులు కావాలి... ఏ ఒక్క మనిషి లేక పోయినా అయిదు నిమషాలు జరగదు. ఇంతమంది నౌకర్లలో ప్రతి రోజూ ఎవరో ఒకరు మానెయ్యకా మానరు. ఇక వేగుతున్న పేలాల్లా మా యింట్లో ప్రతి ఒకరూ ఎగిరెగిరి పడతారు... చూసి తీరవలసిందే.... బాబూ, డబ్బువల్ల మేం పొందుతున్న సుఖం యిదీ.... నెలకి నూటయాభై సంపాదించిన నాడూ మేం అందులో ఇమడలేక పోయాం.... ఇప్పుడు పది వేను వందలు తెస్తున్నా యిమడలేక చెప్పలేని బాధ పడిపోతున్నాం....

మీ నాన్న క్రమశిక్షణలో—సంతృప్తితో, స్వయం సహాయంతో సంతోషంగా బతకడం నేర్చుకున్న మీ కుటుంబానికి ఏం తక్కువయ్యా? ఇప్పుడు చెప్పు గోపాలం మీ నాన్న నీకేం యివ్వలేదుటయ్యా?...

చూడు గోపాలం... మీరందరూ పుట్టక పూర్వం...సుమారు ఏభై ఏళ్ళ క్రిందట...వెన్నెల రాత్రిలో ఏటిఒడ్డున యిసకలో నేనూ రామ్మూర్తీ ఒకరి నొకరు అలసి పోయేదాకా తరుము కొనే మధుర స్మృతులు నాకు మరొక చోట జ్ఞాపకం రావు సుమీ...ఇంతటి చల్లని వాతావరణం యిది...క్రమ బద్ధమైన మీ జీవితంలో నీ భార్య కూడా భాగస్వామి కాగలిగిందంటే నీ అదృష్టాన్ని అభినందించకుండా ఉండలేక పోతున్నాను...నా మనసు కెప్పుడైనా కష్టం కలిగితే విశ్రాంతి కోసం మీ యింటికే వచ్చి తలుపు తడతాను. అవును మరి, రామ్మూర్తి యిల్లు యిది! నిష్కామమైన వాడి జీవితంలో శతాంశం యిక్కడ ప్రతి ఫలించినా యింతకన్న విలువైన ఆస్తి ఉంటుందా? గోపాలం, తలెత్తి నా కళ్లల్లోకి చూస్తూ చెప్పు మీ నాన్న నీ కేం యివ్వలేదా?'

గోపాలం భక్తి కృతజ్ఞతలతో కన్నీళ్లతో నిండిన కళ్లతో ఆయన వైపు చూశాడు. అంత కంటె బాగా ఎత్తున ఉన్న తండ్రి ఫోటో వైపు చూశాడు. హైస్కూలు మేష్టరీ చేసినా అందరూ మనుషులే....అది గుర్తించడం కన్న ఆనందాన్ని అందించేది ఏమున్నది?



శాస్త్రవేత్తలు

# గలీలియో





విశ్వానికి కేంద్రం భూమి అని తీర్పు చెప్పడానికి సమకూడిన న్యాయాధికార్ల సమక్షంలో "గలిలై గలీలియో అనే నేను—తండ్రి కీ॥ శే॥ విన్సెన్జియో గలీలియో, నివాసం ఫ్లారెన్సు, వయస్సు 70 సంవత్సరాలు-సూర్యుడు కేంద్రమనే నా తప్పుడు నమ్మకాన్ని విసర్జిస్తున్నాను. అది పట్టి దురభిప్రాయం—అని ఒప్పుకుంటున్నాను. అట్టి తప్పుడు సిద్ధాంతాన్ని సమర్థించను. ఇతరులకు బోధించను" అని గణిత శాస్త్రజ్ఞుడూ, వైజ్ఞానికుడూ, ఖగోళ శాస్త్రవేత్తా, వృద్ధుడూ అయిన గలీలియో అన్నాడు. ప్రపంచ చరిత్రలో మిక్కిలి గణుతి కెక్కిన కొద్ది శాస్త్రజ్ఞులలో ప్రసిద్ధుడైన గలీలియో, మరణదండన తప్పించుకోడానికి తాను పరిశోధించి కనుగొన్న సత్యాలనే బహిరంగంగా అసత్యాలని ఉపసంహరించుకోవలసి వచ్చింది ఆయనకి.

ఆరిస్టాటిల్ వాదాలను రూపుమాపి, న్యూటన్ సిద్ధాంతాలకు గలీలియో పునాదులు వేశాడు. సరియైన కొలతలు వేయడానికి తగిన పరికరాలు లేనప్పటికీ నవీన విజ్ఞానానికి ప్రయోగాత్మక విధానం స్థాపించాడనీ, ప్రథమ నిర్మాణకర్తఅనీ గణుతి కెక్కాడు గలీలియో.

షేక్స్పియరు జన్మించిన 1564 వ సంవత్సరంలో ఇటలీదేశంలోని పైసా నగరంలో ఉన్ని వర్తకుని ఇంట గలీలియో జన్మించాడు. బాల్యం

నుంచీ గలీలియో అసాధారణమైన ప్రజ్ఞను కనుపరిచాడు సంగీతంలో ప్రజ్ఞాశాలియై ఆర్గన్, లూట్ మొదలైన వాద్యాలు నిపుణంగా వాయించేవాడు. చిత్రకళమీద అభిరుచి ఎక్కువ అతని చిత్రాలను ఆ ప్రాంతం వాళ్లు ఎంతో మెచ్చుకునేవారు. అతని సున్నితమైన చేతివ్రేళ్లు బొమ్మలూ, ఆట వస్తువులూ చేయడానికి ఎంతో ఉపకరించాయి కళలకూ, సాహిత్యానికీ ఉనికి పట్టయిన పైసా నగరంలోని పైసా యూనివర్సిటీలో తండ్రి ఆదేశానుసారం గలీలియో వైద్యశాస్త్రం అభ్యసించాడు

పైసా చర్చిలో వేలాడుతున్న దీపపు కొమ్మ ఊగడం చూచి, కొన్ని పరిశోధనలూ, ప్రయోగాలుచేసి లోలక సిద్ధాంతాన్ని (Pendulum) కనిపెట్టాడు. 1585 వ సంవత్సరంలో ధనాభావంచేత గలీలియో చదువు మానివేసి తనంతట తాను గణిత శాస్త్రంలో కృషిచేయ నారంభించాడు. కళాకారులను, మేధావులను బహూకరించడంలో ఆసక్తి గల ఆ దేశపురాజు పైసా యూనివర్సిటీలో ఒక ఉద్యోగం కల్పించి గలీలియోను గణితశాస్త్ర పండితునిగా నియమించాడు. ఇరవై ఏళ్ల యువకుడు. ఏ డిగ్రీ కూడా లేదు పైగా ఆరిస్టాటిల్ సిద్ధాంతాలను తిరస్కరిస్తున్నాడు. ఇతర పండితు లందరికీ ఇతనంటే గిట్టేది కాదు. ఒక ఆకు, ఒక రాయి పైనుంచి క్రిందకు పడినప్పుడు బరువు వస్తువు త్వరగానూ, తేలికవస్తువు ఆలస్యంగాను పడతాయని అందరకూ తెలుసు దీనికి కారణం air resistence వల్ల అని ఆరిస్టాటిల్ గుర్తించలేదు. Air resistanee ను లెక్కచేయనంత తేలిక వస్తువుల విషయంలో ఆరిస్టాటిల్ యొక్క నిర్ధారణలు సరియైనవి కావని గలీలియో సందేహాన్ని వెలిబుచ్చాడు

విషయమేమిటంటే – అందరూ చెప్పకుంటున్నదే అనుకోండి – వేరువేరు బరువులుగల రెండు బంతులను పైసా స్థంభం మీదినుంచి పడేస్తే రెండూ ఒకేటైము తీసుకున్నాయని, దీనినుంచి విశ్వంలో ఉన్న శక్తుల నన్నిటినీ తెలుసుకున్నాడనీ కథ. ఆరిస్టాటిల్ వాదానికి భిన్నంగా ఉన్న ఈతని వాదాన్ని పండితులు ఒప్పుకోలేదు. ఇంకా వస్తువుల పతనాన్ని గురించిన విశేషాలు ఎక్కువగా పరిశోధించాడు. వస్తువులు నిలువుగా పడడానికి ఎంత టైము పడుతుందో కనుక్కునే సమస్య తీరగానే పటవాలుగా దొర్లడానికి ఎంత టైము పడుతుందో కనుక్కోడానికి సాధనాలు నిర్మాణం చేశాడు

22 అడుగుల పొడవుగల కర్ర కమ్మికి మధ్య ఒక గాడి తయారు చేసి ఆ గాడిలోనుంచి బంతులు జారే టట్టు ఏర్పాటు చేశాడు. టైము కొలవడానికి తగిన సాధనాలు అప్పుడు లేకపోవడంవల్ల ఒక బాల్చీకి రంధ్రం చేసి, నీటి చుక్కలు ఇంకొక గిన్నెలో పడేలాగు చేశాడు. అలా పడిన నీళ్లు తూచి వాని బరువునుబట్టి టైము లెక్క కట్టేవాడు. కమ్మీ చివరంటా జారడానికీ, సగం మేరకే జారడానికీ, పాతికవంతు జారడానికీ ఎంతెంత టైము పడుతుందో, అనేక కోణాల నుంచి—అంటే కమ్మీ లెవెలు మార్చి—వందలకొలది టైము కొలతలను తీసుకున్నాడు. బంతి జారే దూరము టైము యొక్క వర్గాన్ని (root) బట్టి హెచ్చుతూ ఉంటుందనే విషయాన్ని తన గణితశాస్త్ర పాండిత్యం వల్ల సిద్ధాంతీకరించాడు. అంటే ఒక సెకను టైములో ఒక గోళీ అయిదు అడుగులు జారినదనుకుందాం. రెండు సెకనులకు $2 \times 2 \times 5 = 20$ అడుగులు జారుతుందన్న మాట. మూడు సెకనులైతే $3 \times 3 \times 5 = 45$ అడుగులు జారుతుంది.

దీని తరవాత గలీలియో ఇంకొక ప్రయోగం చేశాడు. ఒక బల్లకు రెండు గాడులు చేసి ఒక గాడిలో నుంచి రెండో గాడిలోకి గోళీ ప్రవేశించే లాగు చివర వంపుపెట్టి రెండు గాళ్లూ కలిపాడు. అతి నునుపుగా చేసిన ఈ గాడిలో వదలిన బంతి రెండో గాడిలో ప్రవేశించి పైకి వెళుతుంది. ఎంత పొడవు క్రిందికి జారిందో దాదాపు అంత పొడవూ పైకి ఎక్కుతుంది. కొద్దిగా క్రిందికి వాలి ఉన్న నునుపైన గాడిలో బంతికి వేగం అధికం అవుతుందనీ, ఎగువకు వెళితే వేగం తగ్గుతుందనీ గలీలియో అభిప్రాయం.



గెలీలియో ప్రయోగము

అతి నునుపైన సమతలం మీద బంతిని కదిపినట్టయితే అది ఆగకుండా ఎప్పుడూ తిరుగుతూనే ఉంటుందని గలీలియో కనిపెట్టాడు. ఈ క్రియనే జడిమ (inertia) అంటారు. న్యూటన్ ఈ సిద్ధాంతాన్ననుసరించే చలనం (motion) యొక్క ప్రథమ సూత్రాన్ని నిర్వచించాడు.

ఫిరంగి పేల్చినప్పుడు ఫిరంగిగుండు

ధనురాకారంగా పోతుందని (Parabola) తన వాలుబల్ల సిద్ధాంతాన్ననుసరించి గుండు పోయే మార్గమూ, గురి సరిగా అంచనా వేయడం సాధ్యమైం దతనికి.

ఎత్తైన స్తంభం మీద నుంచి సరాసరి రాయిని క్రిందికి విడిచిపెట్టినప్పుడు, భూమే తిరుగుతూ ఉండడం నిజమైతే రాయి స్తంభానికి కొంత దూరంలో పడాలి కనకనూ, కాని అది స్తంభం వద్దనే పడుతూంది గనకనూ భూమి తిరగడంలేదని గలిలియో ప్రతిపక్షీయుల వాదం. ప్రయాణం చేస్తున్న పడవకొయ్య చివరి నుంచి రాయిని పడవేసినట్టయితే కొయ్య మొదటనే పడుతుంది గనుక వారి వాదం సరియైనదికాదని ఖండించాడు. తిరుగుతూ ఉన్న భూమి మీద ఉన్న మనం, కదలని ఇంకొక దాన్ని చూస్తే గాని మనం కదలుతున్నట్లు కనిపెట్టలేమని కోపర్నికస్ చెప్పిన మాటను సమర్థించాడు.

గలిలియో సిద్ధాంతాలు సరియైనవని, ప్రయోగాలూ, ప్రదర్శనలూ చేసి చూపించినా 1591 వ సంవత్సరంలో అతన్ని పైసా యూనివర్సిటీ ఆచార్యత్వం నుంచి తొలగించారు తాము ఎంతో గౌరవిస్తున్న అరిస్టాటిల్ సూత్రాలకు విరుద్ధంగా ప్రచారం చేస్తున్నాడని పండితులకు కోపం.

ఒక సంవత్సరం తరవాత గలిలియో పడోవా యూనివర్సిటీలో గణితశాస్త్ర పండితుడుగా నియమింపబడ్డాడు. ప్రయోగాల వల్ల సత్యాలని నిరూపింపబడిన అతని గణితశాస్త్ర సిద్ధాంతాల వల్ల దేశ దేశాలలోనూ అతని పేరు మారుమ్రోగిపోయింది. యూరప్ ఖండం అన్ని మూలలనుంచీ అతని వద్ద చదువుకోడానికి విద్యార్థులు విరివిగా వచ్చేవారు.

దూరదర్శనీ యంత్రం తయారు చేయాలనే ఆసక్తితో కటకం (lens) గాజు బిళ్లలను అరగదీసి తయారు చేశాడు. ఆకాశం మీదికి టెలిస్కోపును సారించి అపూర్వమైన విషయాలను గలిలియో కనిపెట్టాడు. చంద్రమండలం యొక్క ఉపరితలం చదునుగా ఉండక భూమికిలాగే ఎత్తు పల్లాలతో, కొండలూ లోయలతో ఉంటుందని కనుగొన్నాడు. చంద్రమండలంలోని పర్వతాల ఎత్తులు కొలవగలిగాడు. నక్షత్రాలలాగ గ్రహాలు స్వయంప్రకాశమైనవి కావనిన్నీ, బయటి నుంచి వెలుతురు వాటి మీద పడుతూ ఉందనీ గ్రహించాడు. నక్షత్రాలు కాంతి పుంజాలనీ, కిరణాల ద్వారా కాంతిని అన్ని దిక్కులకూ ప్రసారం చేస్తాయనీ, మెరుస్తాయనీ ఆయన విశదంచేశాడు.

ఆకాశంలో మనకు కనపడే పాల పుంతను (milky way) పరిశీలించి అందులో వేన వేలు నక్షత్రాలు కల వని చెప్పాడు బృహస్పతి గ్రహం చుట్టూ ఉన్న అనేకమైన చంద్రమండ లాలలో నాల్గింటిని చూడగలిగాడు. సూర్యకాంతిని భూమి ఎలాగైతే గ్రహించి మళ్లీ ప్రతిఫలిస్తూ ఉందో అలాగే ఇతర గ్రహాలన్నీ సూర్య కాంతిని గ్రహించి తిరిగి ప్రతిఫలి స్తున్నాయని ఆయన చెప్పాడు చంద్ర మండలం మీది నుంచి టెలిస్కోపుతో భూమిని చూచినట్టయితే చంద్రుని కళలలాగే భూమికి కూడా కళలు ఉంటాయని విశదపరచాడు ఈ పరి శోధనల వల్ల గలిలియోకి అఖండమైన కీర్తి వచ్చింది. కాని పండితు లతనిని దూషించారు భూమి విశ్వానికి కేంద్రం కాదు అనే సత్యాన్ని అంగీక రించడానికి వారు నిరాకరించారు.

గలిలియో చివరి రోజులలో గ్రంథ రచన సాగించాడు చలనము, వేగా ధిక్యత, గురుత్వాకర్షణ వీటి గురించి "Dialogues on two new sciences" అనే గ్రంథం 1638 వ సంవత్సరంలో ప్రచురించాడు. 1632 వ సంవత్సరం లోనే "A dialogue on the two principal Systems of the world" అనే గ్రంథం ప్రచురించాడు సూర్యుడు కేంద్రమనీ, భూమీ ఇతర గ్రహాలూ సూర్యుని చుట్టూ తిరుగు తాయనీ వర్ణిస్తూ, కోపర్నికస్ సిద్ధాంతాలకు సంబంధించిన ఖగోళ శాస్త్రాన్ని విస్తరించి వ్రాసిన ఉజ్జ్వల మైన విశదీకరణ ఆ గ్రంథం

ఈ రచనలే గలిలియోను ఉరి కంబం ఎక్కించడానికి సిద్ధంచేశాయి అందుకే న్యాయాధికారుల ఎదుట తాను నమ్మిన సత్యాలను నమ్మడం లేదని అన్నాడు కాని ఆ గ్రంథాల వల్లనే అతడు ప్రపంచంలో గొప్ప విజ్ఞానవేత్తగా పరిగణింపబడ్డాడు గలి లియో 1642వ సంవత్సరంలో కాలం చేశాడు. మహోన్నతుడైన గలి లియో అడుగుజాడలనే న్యూటన్ అనుసరించాడు.

భూమి తిరుగుతూనే ఉంది.



ఆనందరావు బస్తీలో పుట్టి, పట్టణాల్లో పెరిగి, నగర నాగరికత వేపు అర్రులు చాస్తు న్నవాడు. అతనికి పల్లెటూళ్ళన్నా, గ్రామవాసులన్నా వీసమెత్తు సదభిప్రాయమైనా లేక పోగా – మహా ఏవగింపు కూడాను.

అతడు హైస్కూల్లో చదివే టప్పుడు "పట్టణజీవితంకంటె పల్లె జీవితం గొప్ప'' అని వాదించే వ్యాసాలు వ్రాశాడు.



పోలవరపు శ్రీహరిరావు

కాలేజిలో చదువుతూండగా "గ్రామ శోభ" అనే మకుటం కింద కళాశాలా వార్షిక సంచికలో కవితా దశకం వ్రాశాడు. అతని స్వభావం తెలిసిన సహాధ్యాయులు "ఇదేమి వైరుధ్యంరా?" అని అడిగితే; "ఒజ్జల ఉజ్జగింపు కోసం — మంచి పేరుకూ, మార్కులకూ" అనేవాడు.

నిజానికి అతడు పట్టభద్రుడయ్యే లోగా పల్లెటూళ్ళను చూచింది రెండే రెండుసార్లు. స్కూల్ ఫైనల్ పరీక్షల తర్వాత ఒక క్లాస్‌మేట్ పెళ్ళికి డెల్టా ప్రాంతంలోని ఒక మాగాణి గ్రామం వెళ్ళాడు. ఆరోజునే వర్షం కురిసింది. ఆ రాత్రి మిత్రుని పెళ్ళిచూచి, తెల్లవారే సరికి కారులు నడిచే రోడ్డుకు చేరడానికే కృద్యవస్థ అయింది.

మరొకసారి - బి.ఏ. చదివే రోజుల్లో - మరొక నేస్తం బలవంతం మీద పల్నాటి సీమలోగల అతని గ్రామం వెళ్ళాడు. ఆ నేస్తం కారుదిగిన తర్వాత "అదుగో, అదేరా మా ఊరు" అంటూనే అయిదారు మైళ్ళు డొంకల్లో తుప్పల్లో రాళ్ళలో నడిపించాడట. అయిదారు రూపాయి లిస్తామన్నా ప్రయాణానికి వాహన మేదీ దొరకని ఆ ప్రదేశంలో. అలా పయ నించి తీరా ఆ గ్రామం చేరువయ్యే సరికి - ఎగువ నెక్కడో వాన కురవడం, ఈ వూరు అంచునే వున్న వాగు పొంగడం, వీరు ఆ మరునాటి వరకూ ఆ వాగు ఒడ్డునే గజగజ లాడుతూ కూచ్చోడం జరిగిందట.

ఏతా వాతా పల్లెటూళ్ళ ప్రసక్తి వస్తే ఆనందరావుకు—బురద, ముళ్ళు, పిడకల పొగ, రొచ్చుకంపు, ఊకపొయ్యి ఊదర, దూడల పంచలో ఉల్లి, మిర్చి ఉట్ల కింద పడకలు; చుట్టలు కాల్చి వుమ్మి లూస్తూ దీర్ఘాలుతీస్తూ మాట్లాడే వృద్ధుల పలుకులు, ముతక బియ్యంలో ఎర్రపచ్చడి కలిపిన భోజనం—ఇవి మాత్రమే గుర్తువస్తాయి. మళ్ళీ ఎంతటి ప్రాణస్నేహితుడు ఆహ్వా నించినా "చచ్చినా పల్లెటూళ్ళ మొహం చూడ" నని భీష్మించాడు.

అలాంటి నాగరీకుడు ఒక పల్లెటూరి పిల్లను బ్రతిమాలి మరీ పెళ్ళిచేసుకున్నా డంటే — ఎరిగిన వారెవ్వరూ నమ్మరు. ఈ పెళ్ళి ప్రసక్తి వచ్చినప్పుడు అతని తలిదండ్రులూ, శుభలేఖ లందగానే మిత్రబృందమూ అత్యాశ్చర్య చకితులు కావడం సహజమే. కాని ఆనందరావే పెళ్ళయిన మూడు వారాలనుంచీ ఆ పల్లె టూళ్ళో, అత్తవారింటో సంతోషంగా కాలం గడుపుతూ—మధ్య మధ్య 'ఈ పెళ్ళి చేసుకుని, ఈ విధంగా వుంటున్నది నేనేనా?' అని సంశయంతో నవ్వు కుంటున్నాడు.

* * *

తన పాతికేళ్ళ జీవితంలో మూడవ సారి పల్లెటూరికి వెళ్ళవలసిన అవసరం

గలగడం—ఈ పెళ్ళికి సందర్భాలు ఒన గూడి రావడం అంతా సినిమాలో డైరెక్టర్ నిర్ణయించినంత అర్థంటుగా జరిగిపోయాయి.

తను హైస్కూలులో, కాలేజిలో, పట్టణాలలో చాలా మంది యువతుల్ని చూచాడు. అందులో అనేక మందిని "అందమైన వాళ్ళు" అనుకున్నాడు. అందమైన వాళ్ళలో కొందరి సాన్నిహిత్యం కోసం అహోరాత్రులూ ఆరాట పడ్డాడు; ఆ ఆరాట మంతటి మోతాదులో గాకపోయినా—తగు మాత్రంగా ఆరాధనా పూర్వకకృషికూడా చేశాడు.

ఈ కృషితో — కొందరితో దగ్గరగా నిలచి మాట్లాడే అవకాశాలను కూడా సాధించాడు వారిలో అయిదారుగురు తాను వివాహమాడదగిన వారని కూడా విశ్వసించాడు. ఒకరిద్దరితో రెండు మూడుసార్లు సినిమాలకు వెళ్ళే భాగ్యం కూడా లభించింది.

ఇంతా జేసి—వివాహం ప్రసక్తి వచ్చే సరికి ఒక్కగా నొక్క యువతైనా, ఉదాహరణకైనా తనకు తగ్గ ఉజ్జీగా నిలబడలేదు. దానిక్కారణం — తనకు అందం, చదువు, ఆస్తి, ప్రేమ,వ్యవహార జ్ఞానం తక్కువ కావడం మాత్రం కాదు. ఇలాగని తాను విశ్వసించడమే గాక, తనను ఎరిగివున్న వారెవరైనా ఢంకా బజాయించి మరీ చెప్పగలరు.

తా నెరిగిన బస్తీ జీవితంలో ప్రేమించ డానికైనా తగిన యువతులు దొరికారు గాని, పెళ్ళి జేసుకోడానికి ఒక్కరూ దీటు రాలేదు. పెళ్ళితో ముడిబడని ప్రేమ అశాశ్వతం గనుక వద్దనుకున్నాడు.

తన సహాధ్యాయులలో తనకంటే తక్కువ యోగ్యతలుగల వారు కూడా— తా నూహించిన దానికంటే ఎక్కువ యోగ్యతలు గల యువతులను ప్రేమిం చెయ్యటం, పెళ్ళాడ్డం — ఎలా సాధ్య మయిందో నని ఆనందరావు ఇప్పటికీ ఆశ్చర్య పోతూంటాడు.

కాలేజీలలో, బస్తీలలో యువతీ యువకులు సన్నిహితులు కావడం, ప్రేమించుకోడం, పెళ్ళిళ్ళు చేసుకోడం సులభమని, అతి వ్యాప్తమని లోకం అనుకుంటుంది. ఆనందరావు తన అను భవం వల్ల— "ఇలాంటి వాటికి లభించే ప్రచారం వల్లనే ఈ లోకాపవాదు పుట్టింది గాని; వాస్తవ జీవితంలో ఇలాంటి సంఘటనలు నూటి కొకటి కూడా ఉండీ ఉండక పోవచ్చు" నని నిర్ణయించు కున్నాడు.

అప్పటికి తన కేడెనిమిది సంబంధాలు వచ్చాయి. తలిదండ్రులు, పెద్దలు ఏమేమో మాట్లాడారు. అందులో తానే కీలక వ్యక్తి అయినా, తాను నిర్వర్తించ వలసిన పాత్రంటూ ఉన్నట్టు కన్పించ లేదు. మొత్తం మీద వాటిలో ఏ సంబం

ధమూ పొసగలేదు ఇదికూడా ఆనంద రావును ఆశ్చర్య పరచిన అంశమే!

"ఇతర యోగ్యతలు వివరాలు ఉభయ పక్షాలకూ తృప్తికరమని తేలిన తర్వాత—పెళ్ళికూతురును చూచేందుకు నచ్చిందీ లేనిదీ చెప్పేందుకు మాత్రమే వరుడు అవసరం కాబోలు!" అనుకుని ఆనందరావు పొట్ట చెక్క లయ్యేట్లు నవ్వుకున్నాడు

కొన్ని సంబంధాల వివరాలు ప్రేక్షకునివలె వినీ పెద్దలతో పాటు తనకూ నచ్చలేదని తలాడించాడు అలాంటి సందర్భాలలో ఒకసారి తన బావ — "ఎవరితోనైనా ప్రేమా, గ్రట్రావుంటే చెప్పవోయ్ — త్వరగా ముహూర్తం పెట్టిస్తానూ!!" అని రహస్యంగా అడిగాడు ఎవరితోనూ అంతటి ఘన సంబంధం ఏర్పడని తాను, ఈ విషయములో చెప్పవలసింది ఏమీ లేదని గుర్తించిన ఆనాడు-ఆనందరావుకు చాలా వెలితిగా తోచింది

ఆవేళే మరొక ఆప్తమిత్రుని వద్ద నుంచి ఒక ఉత్తరం వచ్చింది ఆ మిత్రుడు ఎప్పుడూ మిత భాషియే ఆ ఉత్తరమూ అలాగే వుంది—

"నా పెళ్ళి ముహూర్తం పెట్టడానికి నేను పిల్లను చూచి నచ్చిందనడమే తరువాయి ఎందరి ప్రేయసులకో, మరెందరి భార్యలకో వంకలు బెట్టిన నాకు—నా పెళ్ళి అనేసరికి చెత్వారం వచ్చి

"ఏంసార్! ఘరానాగా చెక్కు-వ్రాసి ఇచ్చారు కాని బ్యాంకులో డబ్బులేదంట?"
"ఆ! అసలు బ్యాంకులోనే డబ్బులేదా? ఈ మధ్యనాకు బ్యాంకులమీద నమ్మకమే లేకుండా పోయింది"

నట్టుంది నువ్వే నీ కళ్ళతో రక్షించాలిరా భాయ్

"వెంటనే రావాలి సశేష విశేషాలన్నీ సమ్ముఖాన" నీ

"రత్నం"

ఈ ఉత్తరంలోని బలీయమైన ఒత్తిడికి వశుడై — పల్లెటూరు వెళ్ళవలసి వచ్చిందనే సంకోచాన్ని పాతివేసి — బెడ్డింగ్ చుట్టుకుని మరుసటి రైలుకే బయలుదేరాడు

* * *

ఆనందరావు దిగవలసిన స్టేషన్ రాకముందే తలుపు దగ్గర నుంచున్నాడు రైలు ఆగీ ఆగకముందే కళ్ళజోడును మరోసారి కర్చీఫ్‌తో తుడిచి ధరించాడు ఆ స్టేషన్ ప్లాట్‌ఫామ్ చాలా దిగువగా వుంది, రైలుపెట్టెలోంచి మూడు మెట్లు

దిగాలి అలాంటి అవసరం లేనట్లే ఆనందరావు తటాలున కిందికి దూకాడు

అతడలా దూకి కాళ్ళు నిలదొక్కుకునే సరికే, రైలు పెట్టెలోంచి ఒక కంఠం "అయ్యో, అదేం పచ్చికిలీ — మెట్లు కనపడతాంచేనే దూకటం ? !" అంది. ఆనందరావు గిరుక్కున వెనుదిరిగి చూచాడు.

తాను దిగిన తలుపులోంచి పదేళ్ళ కుర్రవాడొకడు మెట్ల మీదుగా దిగుతున్నాడు. పదునాలుగు, పదిహేనేళ్ళ యువతి ఒకతె—తలుపు ప్రక్కల నున్న కడ్డీలను గట్టిగా పట్టుకుని, దిగే కుర్రాడి వేపు ఆదుర్దాగా చూస్తున్నది. ఆమె వెనుక దిగనున్న ప్రయాణీకు లున్నట్లు కనిపించడం లేదు. అందువల్ల తన "దూకుడు"ను వ్యాఖ్యానించింది ఆ యువతే నని ఆనందరావు గ్రహించాడు.

ఆమె వ్యాఖ్యానం యింకా తన చెవులలో వినబడుతున్నట్టే వుంది. ఆ మాటలు ఖంగుమని ధ్వనించినా — ఏకో శానా ఎగతాళి వినిపించక పోవడం, పైగా ఆందోళనతో కూడిన మందలింపు ధ్వనించడం ఆనందరావును ఆశ్చర్య చకితుని చేసింది ఎంతో చనువు, అతి సమీప సంబంధం,ఆప్యాయత-అన్నిటిని మించిన అధికారయుత వాత్సల్యంగల వారు మాత్రమే అలా మాట్లాడగలరని ఆనందరావు అభిప్రాయపడ్డాడు

ఇదంతా అర క్షణంలో జరి పోయింది ఇంతలో కుర్రాడు దిగడం పైన వున్న పడతి వెపు చేతులు సాచడ జరిగాయి. అది చూచిన ఆనందరా "ఆ పెద్దామెను, ఈ చిన్నవాడు ఎత్తు దింపుతాడా!" అనుకుని ఫక్కు నవ్వాడు. ఇంతలోనే ఆమె రైలుపెట్టె నుంచి ఒక పావు బస్తా మూటను లా అవలీలగా ఎత్తి, క్రిందనున్న కుర్రాడి అందించబోయింది.

అందిస్తూనే ముఖం చిట్లించింది అందించడం పూర్తి కాగానే చేతు ఛెళ్ళున మోగించి దులుపుకుంటూ— ఆనందరావును పులుకూ పులుకూ చూచి మూతి మూడు వంకర్లు తిప్పుకుంది ఆనందరావుకు షాక్ తగిలినట్లయింది తెల్లబోయాడు.

అతడా షాక్‌నుంచి తేరుకోకముం రైలు వెళ్ళడానికి గంట మోగింది గార్డు ఈల వినిపించింది. అప్పటికిగా ఆ స్టేషనులో కూలీలు లేరని, త బెడ్డింగు రైలు పెట్టెలోనే వుం పోయిందనీ ఆనందరావుకు గుర్తురాలేదు

అతను హడావుడిగా రైల్లోకి ఎక్క బోయాడు ఆమె ఒక బరువైన బుట్టన దిగువనున్న కుర్రాడికి అందించబో న్నది ఆ బరువును దింపే ఆ యువతి చూడగానే ఆనందరావుకు గ్రీకు శిల్పక కళ్ళలో మెదిలినట్లయింది. మద్రాస

బీచిలో దేవీ ప్రసాదరాయ్ చౌదరి మల చిన "బె_స్తల" శిల్పం గుర్తు వచ్చింది.

మళ్ళీ గార్డు ఈల వినిపించే సరికి ఆనందరావు కుడి చేత్తో కడ్డీని అందుకుని రైలుపెట్టె మెట్టు ఎక్కాడు. క్రిందనున్న కుర్రాడు కాళ్ళేత్తినా, పైనుంచి ఆ యువతి అందిస్తున్న బుట్ట అందడం లేదు. తన బెడ్డింగు కోసం ఆమెను తోసుకునైనా తాను లోపలికి వెళ్ళాలను కుంటూ ఆనందరావు మరో మెట్టు ఎక్కాడు.

ఆమె వెంటనే నిఠారుగా నిలిచి—ఒక్కసారి చిరునవ్వు విరియించి "కిందకే అందేదిగా" అంటూనే, ఆ బుట్టను ఆనందరావు నెత్తిమీద పెట్టింది. అసలే హడావుడిగా ఎక్కబోతూ, ఆమె నవ్వుకూ, మాటకూ దిగ్భ్రమ చెందినట్ల యిన ఆనందరావు-ఆ బుట్ట పడిపోకుండా ఎడంచేత్తో పట్టుకున్నాడు. దాని బరువుకు తల నొప్పి పెడుతుంటే, ఆమె చేసిన ఈ అఘాయిత్యానికి విసుగూ, కోపం ముంచుకొచ్చాయి. అయినా కోపగించే వ్యవధి లేక పోయింది.

ఆమె తన ప్రక్కగానే మెట్లు దిగింది. తాను ఊపిరి పీల్చుకోకముందే "ఇట్టా అందిచ్చూ" అంటూ రెండు చేతులూ తనవైపు సాచింది ఆనందరావు కిందిమెట్టు మీదికి దిగుతూ తన చొక్కాను తాకుతున్న చేతుల్నీ ఆమె బుట్ట నందు కోడానికి ఆయత్తంగా వున్న భంగిమనూ



"ఈ మునలో దొచ్చి ఈ చక్కటి సాయం కాలాన్ని మర్దరు చేశాడు."

చూచాడు. ఆమెనుంచి తన శరీరం లోనికి ఏదో–మృదువుగా, చక్కిలి గింతలుపెడుతూ ప్రవహించినట్లయింది. రైలింజను కూత వేసింది. ఆమె "అయ్యో!" అంటూ అతని నెత్తిమీది బుట్టను బలంగా అందుకుందో, లాక్కుందో అతని కర్థం కాలేదు.

ఆమె బుట్టను కిందపెట్టి, అతన్ని ఆశ్చర్యంగా చూస్తూ "దిగూ" అంది. రైలు వెళ్ళడానికి రెండో గంట మోగింది. ఆనందరావు కలలో వున్న మనిషిలా పైకి వెళ్ళి, తన బెడ్డింగు లాక్కుని, కదులుతున్న రైల్లోనుంచి వేగంగా దిగబోయాడు.

ఆమె ముందుకు కదలిపోయిన రైలు పెట్టె వేపు ఆదుర్దాగా చూస్తూ-'అయ్యో! జాగర్త జాగర్త' అంటున్నది అతనిలో హఠాత్తుగా ఉత్సాహం ఉప్పొంగింది అవలీలగా ప్లాట్‌ఫాం మీదికి దూకి ఆమెవేపు పరుగెత్తాడు

అతని రాకను చూచి ఆమె పోయిన దేదో దొరికినంత సంతోషంగా నిట్టూర్చింది. అలవోకగా నవ్వింది. అతడు దగ్గరకంటా రాగానే, మొఖం కంద గడ్డలా మార్చుకుని "ముందే సామాను దీసుకుని మరీ దిగరూ!" అంది. మళ్ళీ ఈ పలుకుల్లో కూడా ఈ సడింపుగాక— అధికారయుతవాత్సల్యమే ధ్వనించడం ఆనందరావుకు మరింత విచిత్ర మనిపించింది.

* * *

ఆనందరావు ఆమెతో ఏమేమో మాట్లాడా లనుకున్నాడు; కాని ఏం మాట్లాడాలో తోచలేదు. ఆమె తీసుకున్న చనువుకు కారణం అడుగుదామనుకున్నాడు. కోప్పడదా మనుకున్నాడు—కాని; ఏమీ అనలేక—అట్లాగే చూస్తూనుంచున్నాడు.

ఆమె అతడేదో చెప్పనున్నా డన్నట్లుగా ఒక క్షణం కళ్ళార్పకుండా చూచింది. మళ్ళీ ఏమనుకున్నదో కుర్రాడి వేపు తిరిగి "ఎడ్డబండొచ్చిందేమో సూడరా" అని పురమాయించింది. ఆ కుర్రాడు లగెత్తాడు. ఆనందరావు స్టేషన్ బైటికి నడిచాడు

బైట నలుగురైదుగురు ప్రయాణీకులు మూటలు నెత్తిమీదో, భుజాల మీదో పెట్టుకుని వెళుతున్నారు ఆనందరావుకు జట్కా రిక్షా, ఆఖరుకు ఒంటెద్దుబండి వంటిదైనా కనిపించకపోయే సరికి దిగులు ముంచుకొచ్చింది.

మిత్రుని గ్రామం అక్కడికి నాలుగు మైళ్ళ దూరమని తనకు ముందే తెలుసు. కనీసం కూలీలైనా వుంటే — బెడ్డింగు ఒకరికెత్తి, తాను నడకనైనా చేరవచ్చు ననుకున్నాడు. ఇక్కడ కూలీలు కూడా లేరు. అతని పని కీకారణ్యం మధ్య చిక్కుపడిన పథికునివలె వుంది.

ఆనందరావు దిక్కులు చూస్తూ నుంచున్నాడు. ఆ యువతి వెంటవున్న కుర్రవాడు అల్లంత దూరంనుంచి స్టేషను లోకి పరుగెత్తుతూ "గిత్తల బండొస్తుందక్కా, గిత్తలబండి; భలేభలే" అంటూ చంకలు కొట్టుకుంటున్నాడు.

ఆనందరావు ఒక రైల్వే నౌకరును పిలిచి పలానా వూరు వెళ్ళాలనీ, బెడ్డింగ్ స్టేషన్‌లో వుంచితే ఆ వూరి నుంచి పాలేర్ను పంపిస్తాననీ, కాపలాకు పావలో, అర్ధో యిస్తాననీ అన్నాడు. అతడందుకు అంగీకరించి బెడ్డింగ్ అందుకొని, "అదుగో—ఆ డొంకెంబడే వెళ్ళండి. అదే దోవ" అని చూపించాడు.

ఇంతలో ఆ యువతి పమిటె చెంగు రెండు భుజాలనూ అదరించేట్టు కప్పుకుంటూ అక్కడికి వచ్చింది ఎడంగా నుంచుని రైల్వే నౌకరు చూపించిన డొంకవేపే చూస్తున్నది ఆనందరావు ఒక్క నిముషం ఆమెను ఎగాదిగా

చూచాడు. ''నాగరికపు హంగులుంటే గ్రీకు శిల్పాన్ని మరపించే అంగసౌష్టవం గల అంగనే'' ననుకున్నాడు. సిగరెట్ తీసి వెలిగించి నడకసాగించాడు.

పది గజాలు నడిచే సరికి "అంత దూరం నడవలేనేమో" ననే సందేహం దిగులూ కలిగాయి. "ఆమె కొరకు ఏదో బండి వస్తున్నది గదా. ఆ బండి యిటే వెళితే ఎంత బాగుండును!'' అనుకున్నాడు. మళ్ళీ అంతలోనే "అయితే మాత్రం—ఆడవాళ్లు నాలాంటి మగవాళ్ళని తమ బండిలో ఎక్కించుకుంటారా? ఛా" అనుకుని నడకసాగించాడు.

* * *

ఆనందరావు డొంకవెంట నడుస్తుంటే క్షణక్షణమూ ఆమెను గురించిన ఆలోచనలే వస్తున్నాయి. తాను రైల్లో వున్నంత సేపూ ఆమె నంతగా గమనించ లేదు. ఈ రైలు స్టేషన్‌లో ఆగిన ఒకటి రెండు నిమిషాలలోనే, మూడు నాలుగు మాటలలోనే ఆమె తనకు ఆశ్చర్య ప్రశ్నార్థకాల సమ్మిళిత వ్యక్తిగా మారిపోయింది

"ఇదే పరిస్థితుల్లో తా నెరిగిన మరే బస్తీ పడుచైనా, కాలేజీ గరల్ అయినా ఎలా ప్రవర్తించేది?" అనే విచికిత్సలో పడ్డాడు ఆనందరావు

రైలుదాకా ఎందుకు — కార్లోంచి దిగేప్పుడైనా, తానంత హఠాత్తుగా



"బీచ్‌లో ఎవరెవర్నో వెంటేసుకు తిరుగుతున్నావ్. వాళ్ళను తుపాకితో దెబ్బ కొక్కణ్ణి కాల్చి చంపుతాను."
"తుపాకితో అయితే ఒక్కడే చస్తాడు. లాభం లేదు. మిషన్‌గన్ తెచ్చుకోండి.''

దూకితే కాలేజిగరల్స్ "అబ్బో హీరో! పోజు బ్రాయుడు" అంటూ పకపక నవ్వేశేవారు. తా నలా దూకడంలో పడిపోయి వుంటే బస్తీపడుచులు మరింత సంతోషపడి చప్పట్లు చరుస్తూ "హీరో హీరో—భీరో" అని ఎగతాళి పట్టించేవారు

అంతేగాని—ఈ యువతివలె ''బిడ్డ కాలు జారుతుందేమోనని తల్లిపడే వ్యధను" ధ్వనించే శక్తి తా నెరిగిన బస్తీ పిల్లలకు లేదు

తాను తన బెడ్డింగ్ కోసం రైలెక్కుతూంటే, ఆమె "బుట్ట నందుకోడానికే వస్తున్నా"నన్నట్లు వ్యవహరించడం,

మధ్యలో "కిందకే అందేదిగా" అనడం, ఆ నవ్వు—ఎంతటి ఆమరిన అమాయక హృదయులకో గాని సాధ్యం కావు

అదే సందర్భంలో తానెరిగిన సరళా దేవి అయితే ఏం చేసేది? కాస్సేపు నిప్పులు తొక్కిన కోతిలా గంతులు వేసేది చివరికి "ఎక్స్యూజ్ మీ మిష్టర్! మా జవాన్లు రాలేదు ఈ దర్టీ స్టేషన్‌లో పోర్టర్సన్నా లేరు ప్లీజ్ హెల్ప్ మి" అనేది తాను సాయపడిన తర్వాత "థాంక్స్" మాత్రం చెప్పి ఆ మరు క్షణంలో ఏమీ జరుగనట్లే వెళ్ళి పోయేది

ఈమె తాను బెడ్డింగుతో రైలుదిగేప్పుడు చూపిన తాపత్రయాసక్తి ఆందోళనా భరితమైన మాటలు చిన్న పిల్లడిని మందలించినట్లు, ఆలిగినట్లు మాటలనడం!!

* * *

ఎంతసేపు నడిచిందీ అతనికి గుర్తు లేదు తా నెరిగిన బస్తీ యువతులను ఇప్పుడు తటస్థపడిన ఈ పల్లెటూరి యువతితో పోల్చుకుంటూ, వివిధాలో చనలకు వశుడై ముందుకు వెళుతున్నాడు

వెనుకవైపునుంచి మువ్వలు, గంటల చప్పుళ్ళతో ఒక ఎడ్ల బండి వస్తున్నది బండితోలేవాడు "ఏమయ్యోవ్ - తప్పుకోవేం డొంక మద్దిన నడుత్తా నిద్దరోతే ఎట్టా" అని కేక బెట్టాడు

ఆనందరావు రెండుఅంగల్లో ప్రక్కకు తప్పుకుని బండితోలేవాడి అమర్యాదకరమైన మాటలకు మింగేద్దామన్నంత కోపంగా కొరకొరా చూచాడు

గిత్తలు వేగంగా గూపులు వేస్తున్నాయేమో, బండి నిముషంలో దాటి పోయింది డొంకంతా ఇసుక చెలరేగింది ఆనందరావు జేబు గుడ్డతో ముఖం తుడుచుకుని "దర్టీ " అంటుండగానే - దూరమౌతున్న ఆ యువతి నిరారుగా నిలబడి చేయి ఊపడం కన్పించింది ఆనందరావు మరింత ఆశ్చర్యపడ్డాడు

బండి అల్లంత దూరంలో ఆగింది ఆమె ప్రక్కనున్న ఆ పదేళ్ళ కుర్రాడు బండినుంచి దూకి ఆనందరావు వద్దకు పరుగెత్తుకొచ్చాడు దగ్గరౌతూనే "ఏమండీ - ఏవూ రెల్లాలండీ?" అని అడిగాడు దగ్గరకు వచ్చి ఆగి రొప్పుతూనే - "మా అక్క అడగ మందండీ మా బండెక్కి ఎల్లినంత దూరం ఎల్లొచ్చునండీ మీ రెల్లే వూళ్లో దిగొచ్చు లెండీ—రండీ" అన్నాడు ఆ అనడంలో చిన్నతమ్ముని వంటి వ్యక్తి మారాం చేస్తూ పిలిచే ఆహ్వానం ధ్వనించింది

ఆనందరావు మనసార నవ్వుకుంటూ ఆ కుర్రాడి భుజంమీద చేయి వేసి గట్టిగా ఒత్తి "పద పద" అన్నాడు కుర్రాడు గువ్వలాగా పరుగెత్తుకెళ్ళి



"సరే రేపు చేరండి. కాని ఒకసంగతి, మీరు అబద్ధాలాడండి, లంచాలు పుచ్చుకోండి, ఏమైనా చేయండిగాని గాంధీగారి ఆదర్శాలు మాత్రం మరువ వద్దు."

ఒక్క వూపులో బండెక్కి అక్క కేమేమో సంబరంగా చెబుతున్నాడు.

ఆనందరావు బండి దగ్గరకు వెళ్ళేసరికి ఆమె లోపలికి జరిగింది. బండితోలే వాడు "నే నేమో అనుకున్నానండీ. మీరు బస్తీవోళ్ళయినా మా మంచో రంట మా చిన్నదొరసాని చెప్పిందిలే ఎక్కండెక్కండి ఏ వూరెల్లాలో, ఎంత దూరం నడుత్తారు పైగా బస్తీల్లో వుండే మారాజులయ్యే" అన్నాడు

ఆనందరావు బండి వెనుకతట్టునగల వసికర్రలు పట్టుకుని ఎక్కాడు వెను కనే అంచున కూచున్నాడు మీద పడిన దుమ్ము దులుపు కుంటున్నాడు బండిగిత్తలను కుర్రాడు అదిలించ బోయాడు.

ఆమె "అంత తొందరేంటిరా - ఆగూ" అని తమ్ముని కసురుకుంది. ఆనందరావు వేపు తిరిగి - "అట్టా చోటు లేనట్టు మూల కూర్చుంటారేం? ఇవతలికి జరగండి" అంది అతను అటు జరుగుతుండగానే - "ఆ పరుపు చుట్ట అక్కడే బెట్టొచ్చారు అసలేవూ రెల్లాలో?" అని అడిగింది

ఆనందరావు సిగ్గు పడుతున్నాడు. ఒక యువతి తనకు తానుగా ఒకకొత్త యువకుని ఆహ్వానించి, చోటిచ్చి, ఆప్యాయంగా మాట్లాడడం నవలల్లో,

కథల్లో తప్ప నిజ జీవితంలో ఎరుగడు ఇదంతా మరో లోకంలా, అపరిచితంగా వుండి అతని మనసు మనసులో లేదు ఆమె ప్రశ్నకు జవాబు చెప్పడంలో కూడా నసిగాడు— ''గోపాలపురం'' అని

ఆమె ఎంతో సంబరంగా "అట్టాగా మా వూరే! మరి ముందుగానే చెప్పొచ్చుగా'' అంది బండి తోలేవాడితో ''ఒరే నువ్వెల్లి ఆ పరుపుచుట్ట పట్టుకు రారా మల్లీ దానికోసం ఎవర్ని బంపుతారో" నని పురమాయించింది వాడు తొట్లోంచి దిగి వెనక్కి పరుగెత్తాడు

ఆ యువతి మళ్ళీ మాటలు కలిపింది! ఆనందరావు తన అన్నకు స్నేహితుడని తెలియగానే అత్తపత్తి ఆకులా ముడుచుకు పోయింది అదీ ఆనందరావుకు ఆశ్చర్య కారణ చర్యగానే తోచింది

* * *

ఆ బండిలో ఆమె ప్రక్కగానే కూర్చుని ఆ వూరి వరకూ ప్రయాణం చేసినా ఆనందరావు తా నెరిగిన బస్తీ యువతులను గురించి వితర్కించుకోడం మానలేదు

* * *

మిత్రుని యింటికి వెళ్ళి స్నానం చేసి కాఫీ తాగి ఇద్దరూ కలిసి ఊరి బెటికి షికారు వెళ్ళినప్పుడు పెళ్ళి బేరాలు జరిగిన రత్నం కంటే ఆనందరావే ముందుగా పెళ్ళిళ్ళ సంగతులు ప్రస్తావించాడు

మిత్రు లిరువురూ తా మెరిగిన పెళ్ళిళ్ళు, యువ దాంపత్యాల బాగోగులు చర్చించుకున్నారు చివరకు ఆనందరావు తానుగా బైటపడి "నీవు పూనుకుని నా పెళ్ళి చేయిస్తేగాని నీ పెళ్ళికూతుర్ని నేను సెలెక్టు చెయ్యనురా రత్నం అంతే" నన్నాడు అతనికిగల గ్రామ జీవిత వైముఖ్యాన్ని ఎరిగిన రత్నం ఆశ్చర్యపడి ''ఇంతగా ధృవాలు మార్చావేంరా భాయ్'' అని అడిగాడు

ఆనందరావు ''మీ చెల్లెలే కారణం'' అని చెప్పలేక బస్తీ యువతులదంతా పై మెరుగుల పటాటోపమేననీ, వాళ్ళదంతా కాలిక్యులేటెడ్ ఎటికసీయేనని, వాస్తవ సౌందర్యం అమలిన ఆప్యాయత పల్లెపడుచుల్లోనే లభిస్తుందనీ, అందువల్లనే తాను ఆ నిశ్చయానికి వచ్చాననీ చెప్పాడు

* * *

రత్నం చెల్లెలితో ఆనందరావు పెళ్ళి పీటలమీద కూర్చునే ఘడియవరకూ - రత్నానికే మిత్రునిమాటలమీద నమ్మకం కుదర లేదు




# 11

## మానవుని ప్రత్యేకత

జీవకోటి మొత్తంలోకి, బ్రతుకును విజయవంతంగా కొనసాగించ గలుగుతున్నది మానవుడే. అతను రకరకాల పరిస్థితులకూ, శీతోష్ణస్థితులకూ తట్టుకో గలుగుతున్నాడు కూడా — అవసరం అనుకున్నప్పుడు అడవులను కొట్టివేసీ, మురికి కూపాలను శుభ్రపరిచీ, ఎడారులను సేద్యార్హంచేసి, ఈ ప్రపంచాన్ని వాసయోగ్యం చేసుకుంటున్నాడు. పెద్ద పెద్ద ఇండ్లనూ, పట్టణాలను కట్టి తనకు అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించుకుంటున్నాడు. మొక్కలనూ, జంతువులనూ తనకు వినియోగపడేట్లు మలుచుకుంటున్నాడు. భూగర్భంలో ఉన్న ఖనిజ పదార్థాలను తన అభివృద్ధికి వాడుకుంటున్నాడు. యంత్రాలు అతని కోసం పని చేస్తున్నాయి. నీటి మీదా, గాలిలోను ప్రయాణం చేయగలుగుతున్నాడు. ప్రపంచంలో జరిగే సంగతుల నన్నిటినీ అవగతం చేసుకోగలుగుతున్నాడు.

దీని కంతటికీ అతని సృజన శక్తే కారణం. ఇదే అతనికి ప్రత్యేకతను గడించి పెట్టింది. ఈ విధంగా అతను ఒక ప్రత్యేకతను గడించుకున్నా, మిగిలిన జీవకోటిలో వున్న గుణాలు కొన్ని అతనిలో ఉంటూనే వున్నాయి. ఇతర జీవకోటికి మల్లే అతని శరీరం ప్రోటోప్లాజంతోనే నిర్మించ బడింది. అతని శరీర నిర్మాణం, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను—చేసుకునే విధానం, రక్త ప్రసార వ్యవస్థా, ఆహారాన్ని జీర్ణించుకునే పద్ధతీ

శాయన్న

సంతానాన్ని వృద్ధిచేసుకునే రీతి—మొదలైన వాటిల్లో మిగిలిన జీవకోటికీ మానవునికీ అనేక పోలికలు వుంటూనే వున్నయి.

నేటి మానవ స్వరూపం యుగయుగాల పరిణామం యొక్క ఫలితంగా ఏర్పడింది అవటంవల్ల, మానవునికీ మిగిలిన జీవజాలానికీ పోలికలు ఉండటంలో ఆశ్చర్యం లేదు. వాటిని అన్నిటినీ కలుపుకునే—మానవుడు రూపొందాడు. కాకపోతే అతనికి ఒక ప్రత్యేకత కూడా వుంది.

ఇక మానవుని శారీరక నిర్మాణాన్ని పరిశీలిద్దాం. మానవుని అస్థిపంజరాన్ని గురించి మనందరికీ ఎంతో కొంత తెలుసు. అది ఎముకకు ఎముక పేర్చినట్లు కోతి యొక్క అస్థిపంజరానికి దగ్గర్లో ఉంటుంది. ఈ ఎముకల గూడు మానవునిలోనున్న మెత్తని పదార్థాలను ప్రమాదానికి గురి చేసే అవకాశం ఉన్నా వాటిని కాపాడటానికి నిర్మించబడినట్లు కనుపిస్తుంది. మెదడుకి సంబంధించిన ఎముకలు మెదడును కాపాడుతవి. వెన్నెముక యొక్క వంపులు 'స్పయినల్ కార్డ్'ని కాపాడుతుంది. గుండె ఎముకలూ, పక్క ఎముకలూ, రొమ్ములోనున్న మెత్తని అంగాలను కాపాడుతవి. కండరాలకు కప్పుగా వినియోగపడతై. కాల్షియమ్, భాస్వరం మొదలైన వాటిని తమలో నిలవచేసి, అవసరం అయినప్పుడు శరీరానికి అందిస్తూవుంటై.

శరీరానికి తరువాత ముఖ్యమైంది—రక్త ప్రసారం. ఎముకలూ మానవునిలోని యితర అంగాలూ ఎప్పుడూ రక్తంతో తడుస్తూ వుండాలి. అలా ఉన్నప్పుడే అవి సజీవంగా ఉండగలుగుతవి. ఈ రక్తం పోషక పదార్థాలనే కాక, రకరకాల ఉప్పులను, ప్రాణవాయువునూ, బొగ్గుపులుసు గాలినీ, ఎరుపు తెలుపు కణాలనూ మోసుకుపోతూ ఉంటుంది.

రక్తం ప్రసారం అవటానికి హృదయం కారణం. ఇది ఒక గోడవల్ల కుడి ఎడమ భాగాలుగా విభజించబడి వుంటుంది. ప్రతి భాగానికీ పై అంతస్తూ, క్రింది అంతస్తూ ఉంటై. ఎడమ భాగం రక్తాన్ని శరీరంలోకి వివిధ భాగాలకు ప్రసారం అయ్యేటట్లు చేస్తుంది. ఈ విధంగా ప్రసారం అయిన రక్తం నాళాల సహాయంతో హృదయంలోకి కుడి భాగం ప్రవేశిస్తుంది. అక్కడ నుంచి అది ఊపిరి తిత్తులలోకి పంపబడుతుంది. అక్కడ అది బొగ్గుపులుసు గాలిని విడిచిపెట్టి ప్రాణవాయువును తీసుకుంటుంది. ఈ ఊపిరితిత్తులు గాలిని పీల్చుకునే టప్పుడు ప్రాణవాయువును లోపలికి తీసుకుని, గాలిని విడిచి పెట్టేటప్పుడు బొగ్గుపులుసు గాలిని బయటకు విడిచిపెడుతూ వుంటై.

ఈ విధంగా శుభ్రపడిన రక్తం తిరిగి హృదయంలోకి ప్రవేశిస్తుంది ఈ పని నిరంతరం మానవుడు జీవించి ఉన్నంత కాలం జరుగుతూనే వుంటుంది హృదయం ఆగిపోతే రక్తం ప్రసరించదు రక్తం గడ్డ కడుతుంది మానవుడు మరణిస్తాడు

రక్తం ప్రసారం అయ్యేప్పుడు ఒక దశలో మూత్రకోశంలోకి వెళ్తుంది ఇక్కడ అది తనలో ఉన్న నీటినీ, లవణాన్నీ, పంచదారనూ, యూరియా వంటి పదార్థాలనూ విడిచిపెడుతుంది తిరిగి పరిశుభ్రపడిన నీటినీ, లవణాన్నీ పంచదారనూ తనలోకి తీసుకుంటుంది తాను విడిచిన వాటిలోని ఎక్కువ భాగం ఈ విధంగా తిరిగి ఉపకరిస్తుంది మిగిలిన పదార్థాన్ని అది మలిన పదార్థంగా విసర్జిస్తుంది

ఈ విసర్జించే పని కొంతవరకు అది బయటకు పంపుతుంది చమట ద్వారా అది కొంత మలిన పదార్థం బయటకు వెళ్లటానికి కూడా సహాయ పడుతుంది

మనం ఈ శరీరాన్ని పోషించటానికి అనేక ఆహార పదార్థాలను భుజించవలసి వుంటుంది ఈ ఆహారపదార్థాలు శరీరానికి శక్తిని ఇస్తవి ఈ ఆహార పదార్థం ప్రోటోప్లాజం వృద్ధి చెందటానికీ, శరీరం చేసే పనులను అదుపులో పెట్టడానికి అవుసరమైన రసాయినిక పదార్థాలనూ ఇస్తుంది



'చూశావా ? నీ ముద్దుల కొడుకు ఏం చేశాడో ! నాయుడుగారి అమ్మాయితో లేచిపోయాటడ ''

''తప్పేముంది ? మీరూ నాతో లేచివచ్చినవారేగా !''

---

మనం ఆహారాన్ని నమిలి మ్రింగుతాం అంటే దానిని జీర్ణం అవటానికి వీలుగా చేస్తాం అన్నమాట మనం మ్రింగిన ఆహారం కడుపులోకి వెళ్తుంది అది అక్కడ పూర్తిగా నలగగొట్టబడుతుంది అంటే పూర్తిగా జీర్ణం చెయ్య బడుతుందన్నమాట

ఈ విధంగా పచనం చెయ్యబడిన ఆహారాన్ని రక్తం అందుకుంటుంది అలా అందుకుని శరీరంలో వున్న అన్ని కణాలకూ పంచి పెడుతుంది ఇక్కడ ఆహార పదార్థం శక్తిగా మార్చబడుతుంది ఆ శక్తి ప్రోటోప్లాజం అభివృద్ధికి వినియోగపడుతుంది ★

# సామెతలు - బొమ్మలు



ఏనుగకు వెలక్కాయలు లోటలోట




సుఖాలు వచ్చేటప్పుడు మెల్లిమెల్లిగా ఒకదాని తరువాత ఒకటి వస్తాయి. కాని కష్టాలు రాకుండానే వుండాలి రావడం మొదలెడితే అన్నీ ఒకేసారి వచ్చిపడి మనిషిని ఎన్ని విధాల పీడించాలో అన్ని విధాలా పీడిస్తాయి. మానవ జీవితంలో ఎంతోమంది కష్టాలుఅనుభవిస్తున్నవారినిచూస్తున్నాం,

సుఖాలు అనుభవిస్తున్న వారినీ చూస్తున్నాం. కష్టాల్లో సుఖాన్ని చవిచూడ గలిగిన వారిని. సుఖ జీవితం గడుపుతూ వుండి కూడా కష్టాల్నే గుర్తుతెచ్చుకుంటూ జీవితం దుర్భరం చేసుకునే వాళ్లనీ చూస్తూనే వున్నాం.

కాని కొందరి జీవితాలు కష్టాలనే గాడిలో ఒకసారి పడితే మరి జీవితాంతం వరకు తప్పుకోలేక అవస్త పడుతూనే వుంటాయి.

ఆ తెగకు చెందినవాడే మేజర్‌రావు. అది దురదృష్టమే అనండి; కర్మ అనండి. ఏది ఏమైనప్పటికి రావుగారి జీవితం అంతా కష్టాలతోనే గడిపాడు. మా అందరిలోనూ పెద్దవాడవటం చేత, చాలా మంచివాడవటం చేత మా అందరికీ ఆయనంటే ఒక విధమైన గౌరవం వుండేది. మాకంటే పెద్దవాడైనా, మా నాన్న వాళ్ళలో కలిసేవాడు కాదు. మంచి అభ్యుదయ భావాలున్న మనిషి అవటం చేత మా కుర్రకారందరినీ ఎప్పుడూ వెనకాల వేసుకొని తిరుగుతూ వుండేవాడు.

నాకు బాగా జ్ఞాపకం-వేసవి సెలవలకు ఒకసారి రైలుపట్టా లవతల వున్న మామిడి తోటలోని మామిడి కాయలు దొంగిలించాం. ఎక్కడ దాక్కొని వున్నాడో తోటవాడు అమాంతంగా వచ్చి మమ్మల్ని పట్టుకున్నాడు. తన్నడానికి సిద్ధమయ్యాడు. తిన్నకాయలకు డబ్బు అక్కడ పెట్టమంటాడు. లేకపోతే తిన్నది కక్కమంటాడు. ఎలారా భగవంతుడా అని చమటలు కక్కుతూ నిలబడివున్నాం. ఆ సమయంలో ఎక్కడి నుంచి వచ్చాడో దేవుడులా వచ్చాడు మా రావుగారు. ఆ తోటవానికి ఏవో మంచిమాటలు చెప్పి మమ్మల్ని విడిపించాడు. డబ్బు లివ్వలేదు, ఏమీలేదు. కేవలం మాటలతోటే సాధించుకొచ్చాడు. "రండి; అబ్బాయిలు," అంటూ మమ్మల్నందర్నీ తీసుకుపోయి పొలం గట్టుమీద కూర్చోపెట్టి చక్కగా, నాజూకుగా, బుద్ధి చెప్పాడు. ఆ రోజు నుంచీ ప్రతిరోజూ ఆయనను కలుసుకుంటూ వుండేవాళ్ళం. మెల్లిగా ఒక విధమైన భక్తికుదిరింది ఆయనంటే.

అంతకు క్రితం సాయంకాలం వరకు ఏవో అల్లరి చిల్లరి పనులు చేసుకుంటూ తిరిగే మేమంతా ఆ రోజునుండీ ప్రతి సాయింత్రం ఆ మామిడి తోట దగ్గరకే చేరే వాళ్ళం. సరిగ్గా అయిదు గంటలకల్లా మా రావుగారు వచ్చేవాడు. తెల్లగా, సన్నగా వుండేవాడు. మంచి ఆజానుబాహువు అవటం చేత మాకు చాలా దూరం నుంచే కనపడే వాడు. ఎంతో దూరాన ఆ విగ్రహం కనపడగానే మాకు ఏదో అర్థం కాని ఆనందం పుట్టుకొచ్చేది. ఆయనలో ఏదో మా చిన్ని బుర్రల కందని అయస్కాంతం వుండేది. ఆయనదగ్గర వుంటేచాలు, ప్రపంచంలో

ఎవరూ మమ్మల్ని ఏమీ చేయలేరనీ, అంతే కాకుండా ప్రపంచంలో ఏ మహత్తర శక్తినైనా ఎదిరించగల మని మొండి ధైర్యం కూడా వుండేది మాకు.

అప్పట్లో ఆయన బి. ఎ. ప్యాసయి వుద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్న రోజులవి. అప్పుడప్పుడు ఏవో ఇంటర్వ్యూలకని అక్కడికీ ఇక్కడికీ వెళ్ళివస్తూ వుండేవాడు. వచ్చింతరువాత అక్కడ జరిగిన విషయాలన్నీ ఎంతో చమత్కారంగా మాకు చెపుతూ వుండే వాడు. కాని వుద్యోగం మాత్రం ఆయన కొచ్చేది కాదు. యింత విజ్ఞానం కలిగిన మనిషి, ఈయనకు ఎందుకు వుద్యోగం యిచ్చేవారు కాదో మా కర్థమయేది కాదు. మాలో మేమే తర్కించుకునే వాళ్ళం. ఒకవేళ ఈయన చెప్పే సమాధానాలు ఆ ఆఫీసర్ల కర్థమవ లేదేమో అనికూడా అనుకొనే వాళ్ళం. ఏది ఎలాగయితే నేమి మాకు తెలిసినంత వరకు ఆయనకు మాత్రం వుద్యోగం దొరికేది కాదు.

## పదిహేను సంవత్సరాల అనంతరం

నాకు ఏలూరు బదిలీ అయింది. నా భార్య ముగ్గురు పిల్లలతో ఏలూరులో మా పాత యింట్లోనే దిగాం. ఆ వూళ్ళో మొట్టమొదటనుంచీ సొంతయిల్లే వుండ టంచేత అద్దెగొడవ తగ్గుతుంది కదా



"ఇదుగో! మా వదినె పంపింది దాసీని. దాన్ని కాస్త జాగ్రత్తగా చూసుకోండి మన పనిమనిషి కరువు తీరుతుంది.''

అనే వుద్దేశ్యంతోటే అధికారుల్ని పట్టు కొని మెల్లిగా ఆ వూరే వేయించు కొన్నాను. ఆ రోజు ఆగష్టు నెల 8 వ తారీకు. నాకు బాగా జ్ఞాపకం. ఎందుకంటే నాకు కాస్త సంఖ్యాశాస్త్రంలో నమ్మకం వుందిలెండి. రెండు ఎనుముదులు కలిశాయి. ఏ చెడ్డ విషయమైనా వినవలసి వస్తుందేమో నని భయపడుతూనే వున్నాను. రోజల్లా సక్రమంగానే గడి చింది. సాయింకాలం సరదాగా చిన్నప్పుడు ఆ వూళ్లో జరిగిన విషయా లన్నీ సింహావలోకనం చేసుకుంటూ కూర్చున్నాను. షికారు వెడదామని బుద్ధి పుట్టి రైలుపట్టాలు దాటి మామిడి తోట లోనికి వెళ్లాను. దాదాపు పదిహేను సంవత్సరాలక్రితం చూచిన తోట. ఎక్కడి చెట్లు అక్కడేవున్నాయి. కాని, వాటిలో కూడ ఏదో కాస్త మార్పు కనిపించింది

నాకు. పాపం! పాత తోటమాలి అప్పల స్వామి చనిపోయాడట. అతని కొడుకే చూసుకుంటున్నా డిప్పుడు. ఆ సంగతి నాకు తెలియక ఆ తోటలోకివెళ్ళి "అప్పల స్వామీ" అని కేకవేశాను. కొంత సేపటికి అతని కొడుకు వచ్చాడు గుడిశ లోనుంచి ఆశ్చర్యంగా నన్ను చూస్తూ. నే నతన్ని పోల్చనే లేదు. "ఏమయ్యా! అప్పలస్వామి ఉన్నాడా?" అని అడిగాను. "మా నాయన చచ్చిపోయి అయిదారేళ్లయింది. యిప్పుడు వచ్చి ఆయన్ని పిలుస్తున్నారా! మీ రెవరేమిటండీ" అని అడిగాడు.

"అయ్యో పాపం! అప్పలస్వామి పోయాడా" అని నీ వెవరవని అడిగాను. అప్పటికి అతనే నన్ను పోల్చుకొని "మీరు పలానా కాదా," అని అడిగాడు. ఒకర్ని ఒకరు తెలుసుకున్న తరువాత బరువెక్కిన హృదయంతో తోటంతా కలియ జూచాను. చాల dirty గా వుంది. మునుపున్న శుభ్రత లేదు. చెట్లన్నీ ఏదో దిగాలుగా నా వంక చూస్తున్నాయి. కాపుకూడ బాగా తగ్గింది.

"సంరక్షణ బాగా లేదు రామయ్యా!" అన్నాను.

"ఏం చేయమంటారు బాబు! పెద్దయ్య గారు పోయాక తోటసంగతి కనుక్కునే వారే లేరు. పదిహేను రూపాయల జీతంలో ఎంతని కష్టపడను బాబు! అందుకని అడపాతడపా పైపను లేమైనా దొరికితే చూసుకుంటూ వుంటాను". అతనితో మాట్లాడుతూనే తోట బయటకు వచ్చాను. చిన్నప్పుడు మేము కూర్చునే పొలం గట్టు వైపుకు నడిచాను. దూరాన్నుంచి ఎవరో మా చోటులో (క్షమించండి పూర్వం మేం కూర్చునే చోటులో) కూర్చొని వున్నాడు.

నాలో ఏదో ఈర్ష ప్రవేశించింది. ఎందుకో నాకే అర్థం కాలేదు. ఆ పొలం నాదికాదు సరికదా కనీసం అక్కడ కూర్చునే అధికారం కూడ నాకు లేదే! ఎందుకు నాకీ ఈర్ష్య! నడిచి వెడుతున్నాము నేను, రామయ్య: ఎక్కడో చూచినట్లుగా వుంది అతన్ని. నా కేసి కూడ చూడటం లేదు. అతని బాగా మాసిన గడ్డం అదీ చూస్తే బ్రతికి చెడ్డ వానిలాగే కనిపించాడు. "రామయ్యా యితన్ని ఎక్కడో చూసినట్లుందోయ్. ఎవరో తెలుసా?" అని అడిగాను.

"అదేమిటి బాబు! మన రావుగారే నండి. పాపం ఎటువంటి వాడు ఎలా అయిపోయాడు బాబూ" అన్నాడు. ఒక్కసారి నూతిలోకి నెట్టినట్లుగా అయింది నాకు.

"ఏమిటి! మన రావుగారేనా!" అవును ఆయన లాగానే వున్నాయి పోలికలు. అదేమిటి అలా మాసిపోయిన బట్టలు వేసుకున్నాడు? పైగా నల్లగా అయిపోయాడే! ఎంతటి అందగాడు. ఎంత

నీటుగా వుండేవాడు మనిషి! యింతటి మార్పుకు కారణం? తగలలేదు నా బుర్రకు—సమీపించాం.

"నమస్కారమండీ రావుగారు"—నాకేసి అదోలాగా చూసి, లేచి నిదానంగా వెళ్ళిపోయా డాయన. పాపం నన్ను గుర్తు పట్టలేదు కాబోలు. "నేను మూర్తినండీ" అని చెప్పాను. వినిపించుకో లేదు. గబగబా నడుస్తున్నాడు. అప్పుడు చూచాను అతనికి ఒక చెయ్యి లేదని. పైగా కుంటుతున్నాడు కూడ.

"అదేమిటి రామయ్యా! ఆయన కాదులాగుందయ్యా" అన్నాను.

"అబ్బే! ఆయనే బాబు. యుద్ధంలో కాలు, చెయ్యి పోగొట్టుకున్నాడు" అన్నాడు. ఈలోగా ఆయనే, ఒకవేళ నన్ను గుర్తుకు తెచ్చుకున్నాడో ఏమో తిరిగి వచ్చాడు.

"మీరు కుందావా రబ్బాయి కదూ" అన్నాడు.

"అవును" అన్నాను.

"నాకో రూపాయి ఇవ్వు" అన్నాడు. ఆశ్చర్యం వేసింది. ఎక్కడి రావుగారు! ఈ అవతారం ఏమిటి? ఈ ముష్టేమిటి? తలవని తలంపుగా జేబులోనికి చెయ్యి వెళ్లింది. చిల్లరలేక అయిదు రూపాయల కాగితం యిచ్చాను." "యిక్కడే కూర్చోండి. యిప్పుడే వస్తాను" అని చరచర కుంటుకుంటూ వెళ్ళిపోయా డాయన.



తమ టిక్కెట్టు!

చాలాసేపు కూర్చున్నాను. రామయ్య అంటూనే వున్నాడు. "ఆయన ఎక్కడ వస్తాడు బాబు. ఎక్కడో తాగేసి దొర్లుతుంటాడు" అని. కాని నాకెందుకో ఆయన మళ్లీ వస్తాడని గట్టి నమ్మకం వుండిపోయింది. రామయ్యను పంపించి కూర్చున్నాను ఏకాంతంగా ఆ పొలం గట్టుమీద. సంధ్యాసమయం కూడ అయిపోయింది. వేడి గాలి తగ్గిపోయి ఎక్కడినుంచో చల్లగా తగులుతోంది మలయమారుతం. నాకు తెలియకుండానే కునుకువచ్చి అలాగే పడుకుండిపోయాను ఆ పొలం గట్టు మీద.

"మూర్తీ! మూర్తీ!" నన్ను తట్టి లేపా డాయన.

"నా కిప్పుడే జ్ఞాపకం వచ్చిందయ్యా నిన్నిక్కడే వుండమన్న సంగతి. పాపం ఆకలి వేస్తోందికదూ? యిదిగో నీ కోసం శనగలు తెచ్చా — యింద", అంటూ ఒక కాగితంపొట్లాం నాకు

ఇచ్చాడు, ఆయన ఒక దానిలో నుంచి తింటూ

శనగలు రుచిగానే కనిపించాయి ఆకలితో దహించుకుపోతున్న నాకు చాలా సేపు మౌనంగానే గడిచింది శనగలు తింటున్న చప్పుడు తప్ప

"మూర్తీ ! మీలో ఎవరైనా కనిపిస్తారేమో ననే నయ్యా ఈ రెండేండ్ల నుండి 'రెగ్యులర్'గా వస్తున్నా' అన్నాడు వాసన భరింపరానిదిగా వుంది మనిషిలో గాని మాటలో గాని ఏ విధమైన తొట్రుపాటు లేదు పైగా యిందాకటి కంటే యిప్పుడే తెలివిగా కనిపిస్తున్నాడు- పూర్వపు రావుగారు కనిపిస్తున్నాడు ఆ మాట ఆ తీరు నా కోసం శనగలు తేవటం అన్నీ చూచేటప్పటికి నాకు మునపటి రావుగారు జ్ఞాపకానికి వచ్చాడు నా చిన్నప్పటి జీవితంలోకి వెళ్ళిపోయాను 'ఏమండీ ! యిలా అయిపోయారేం !" అన్నాను

"ఆ సంగతి నీకు చెప్పడానికే నిన్ను రూపాయి యివ్వమన్నాను కాని నీవు దయతో యిచ్చిన అయిదు రూపాయలతో కొంత పాత బాకీ కూడ తీర్చేశానులే" అన్నాడు పాపం సారా తాగి వచ్చాడు "మా తండ్రిగారిని ఈ వూరి నుంచి చెన్నపట్టణం బదిలీచేశారు అక్కడ కూడ ఉద్యోగ ప్రయత్నం మానకుండా ప్రయత్నం చేస్తూనే వున్నాను కాని ఏమీ లాభం లేకపోయింది ఈ లోగా యుద్ధం వచ్చింది SecondLieutenaut కు అప్లయిచేశాను సెలక్టు అయ్యాను అంతకు ముందు సంవత్సరమే పెండ్లి అవటంచేత నా భార్య నన్ను యుద్ధానికి పంపడానికి చాలా కష్టపడింది అయినా వుద్యోగం దొరక్క నేను పడ్డ అవస్తలన్నీ అర్థం చేసుకొని వీరపత్నిలాగా నన్ను పంపింది యుద్ధభూమికి

అది ఆగష్టు 8 వ తారీకు అస్సాం బోర్డరులో మేజరుగా వున్నాను మానవ జీవితం తృణప్రాయంగా చూచేరోజులవి మిత్రుడు మోహన్, నేనూ కలసి ట్రెంచ్ లోనే కాఫీ త్రాగుతున్నాం నే వద్దంటున్నా కూడా వినిపించుకోకుండా మోహన్ గాలికోసమని నిటారుగా నిలబడి ఆనందిస్తున్నాడు ఎక్కడి నుంచి వచ్చిందో ఆ బుల్లెట్ మా వాడ్ని తీసుకొని వెళ్ళిపోయింది నా వళ్లుమండిపోయింది నా చేతిలో వున్న మెషీన్‌గన్ తీసుకొని పిచ్చివానిలా శత్రు మూక మీద పడ్డాను నా అదృష్టం, నేను చావ లేదు కాని చెయ్యి కాలు మాత్రం పోగొట్టుకున్నాను శత్రుమూకలో ఎంత మంది చచ్చారో నాకు తెలీదు

నాకు తెలివి వచ్చిం తరువాత చూచుకున్నా నాకు చెయ్యి లేదని నా మోకాలులో కూడా ఒక 'బుల్లెట్' వెళ్ళింది కాని కాలు మాత్రం తియ్య

వల్సిన అవసరం లేదని వదలి వేశారు డాక్టర్లు

నా తండ్రి బ్రతికి వున్నంత కాలం యింటి వద్ద నుంచి వుత్తరాలు వస్తూనే వుండేవి కాని ఆయన పోయాక యింటివద్ద విషయాలే తెలిసేవి కావు నా భార్యకు మొదటి నుంచీ వుత్తరాలు వ్రాయటమంటే వల్లమాలిన సిగ్గు అందుచేత కాబోలు ఆవిడ కూడ వ్రాయలేదనుకునే వాణ్ణి

ఇక active Service కు పనికిరానని నన్ను మిలిటరీ నుంచి యింటికి పంపించారు అప్పుడు గాని నాకు తెలియలేదు మిష్టర్ మూర్తీ ! నా భార్య నా పాలిట ఒక కొడుకును వదలిపెట్టి ఈ లోకం వదలి వెళ్ళిపోయిందని

బాధలు భరించగల శక్తి భగవంతుడు కొందరికి యిస్తాడు నా కివ్వలేదు బాబూ ఏ భార్య కోసం తిరిగివద్దామని ఆనంద జీవితం గడుపుదామని గాలిమేడలు కట్టుకున్నానో ఆమే లేనప్పుడు నా కెందుకు ఈ జీవితం అనిపించింది కాని బిడ్డడి కోసం బ్రతకా లనిపించి, జీవితం గడిపాను

యుద్ధంలో గెలిచిం దెవరో ఓడిం దెవరో నే నెరుగను గాని నేను మాత్రం సంపూర్తిగా నాశనమై పోయాను అలవాటయిన తాగుడు వదల్లేక చాల కష్టపడే వాడ్ని మిలటరీలో సంపాదించిన



"జోస్యం ఫ్రీ '

డబ్బుతో మొదటి రోజుల్లో బాగానే తాగేవాణ్ణి డబ్బు అయిపోయాక అప్పు పుట్టినంత కాలం తాగాను అదీ ఆగిపోయింది

ఒక రోజున మనతో కలిసి తిరిగేవాడట రామారావు, అతను కనిపించి నా పరిస్థితిని చూచి నాకు రెండు రూపాయలు ఇచ్చాడు అప్పటికే నా మురళి (అంటే మా అబ్బాయి) తెలివి మీరి పోయాడు నన్నలా త్రాగొద్దని ఎంతో బ్రతిమాలేవాడు తాగనని మాట యిచ్చాను కూడా ఇంత చిన్నవాడితో చెప్పించుకోవల్సి వచ్చింది కదా అనే బాధే కాకుండా నా గురించి ఆ తల్లిలేని అమాయక హృదయం ఎంతబాధ పడుతుందో నని విచారించే వాడ్ని

రామారావు ఇచ్చిన రెండు రూపాయలే నా జేబులో వున్నాయి నా మురళిని తీసుకొని దారిన వెడుతున్నాను సాయంత్రం ఆరున్నర అయివుంటుంది అప్పటికి రెండు రోజులనుంచి త్రాగటం లేదు డబ్బులేక ఈ రెండు రోజులలో

మురళికి ఎన్ని వొట్లన్నా పెట్టాను, ఇక జీవితంలో తాగనని కాని ఈ రోజు మాత్రం భరించ లేకుండా వున్నాను నర నరాలు బాధ పెడుతున్నాయి చాల నీరస స్థితిలో వుంది శరీరం నాకు తెలీ కుండానే నా కాళ్ల సారాకొట్టుకు తీసుకు వెళ్లాయి దారిలోనే మురళికి చేసిన వాగ్దానాలన్నీ జ్ఞాపకం వచ్చి నా మనుస్సును కలవరపెట్టినా మొండికెత్తి నడిచాను సారాకొట్టుకి అప్పుడే కొట్టు లోంచి బాగా తాగి తూలుతూ వస్తున్న ఒక వ్యక్తిని చూచాడు మురళి "

"నాన్నా యిక్కడికి వద్దు నాన్నా వేరే ఎక్కడికైనా వెడదాం" అన్నాడు

"లేదు బాబూ! యివ్వాళ ఒక్క రోజే. ఎక్కువ తాగనులే ఒక్క రూపాయికే యిదిగో ఈ రూపాయి నీ వుంచుకో", అంటూ అతని చేతిలో పెట్టి "యిక్కడే కూర్చో. పది నిము షాలలో వస్తాను", అని బ్రతిమిలాడాను తండ్రి మీద జాలిపడ్డట్టున్నాడు నా బిడ్డడు — సరేనని అక్కడే తూము మీద కూర్చున్నాడు

వాములు మ్రింగే స్వాములకు పచ్చ గడ్డి ప్రసాదంలాగా, ఆ రూపాయి మందూ నా బుర్రకు అందలేదు పైగా యిక లేదనుకునే టప్పటికి పిచ్చెత్తి క్కించి వేసింది చటుక్కున జ్ఞాపకం వచ్చింది మురళికి యిచ్చిన రూపాయి



బయటకు వచ్చేటప్పటికి మురళి ఏదో వెతుకుతున్నాడు "మురళీ! ఏది బాబు, ఆ రూపాయివ్వు రేపు యిస్తాను నీకు మళ్లీ", అని అడిగాను

"లేదు నాన్నా! యిక్కడే ఆడుకుంటున్నాను ఎవరో కుర్రాడు వచ్చి మాజిక్ చేస్తానంటూ ఆ రూపాయిని మాయం చేశాడు యిక్కడే మట్టిలో వుంటుంది వెతకమన్నాడు నాకు కనపడక నీకోసం కేకవేసే టప్పటికి పారిపోయాడు నాన్నా! రూపాయి దొరకటంలేదు నాన్నా", అన్నాడు ఏడుస్తూ నాకు ఎక్కడలేని ఆవేశం వచ్చింది వుడుకులు బోతునై పోయాను నా ఆస్థంతా తగలేశాడు నా కుర్రవాడను కున్నాను ఆ నష్టానికి పరిహారం ఏమిటో అర్థంకాలేదు నాకు చాచిపెట్టి కొట్టాను చెంప మీద దెబ్బకు మాట లేకుండా పడిపోయాడు నా మురళి —

అయ్యయ్యో ఎంత పని చేశాను! నా బిడ్డను కొట్టేశానే! అయ్యో మాట కూడా లేదే! ఏం చెయ్యను—ఎవరో దయాత్ములు యింత నీళ్ల పోసేటప్పటికి తెప్పరిల్లుకున్నాడు కాని వణుకు తున్నాడు నన్ను చూసి జడిసి పోయాడు కాబోలు "లేదు బాబూ! రా!", అంటూ దగ్గిరకుతీసుకొని యింటికితీసుకొచ్చాను అంతే నాయనా! ఆ రోజే మంచ మెక్కాడు జ్వరం తీవ్రంగా వచ్చింది



"డబ్బివ్వకుండా బైట ఎట్లాపడ్డావు?"
"అదే కష్టం! మేనేజరు మెడపట్టి బైటికి గెంటాడు"

మందులు కొనడానికి డబ్బు ఎవరినైనా అడిగితే తాగడానికే అడుగుతున్నానను కొని యిచ్చే వాడు కారు జ్వర తీవ్రత ఎక్కువై ఏదో పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ వుండేవాడు "నాన్నా మాజిక్", అనేవాడు "యిక నుంచి తాగొద్దు నాన్నా తాగావంటే అమ్మతో చెప్పేస్తా" అంటే అప్పుడే నిర్ధారణ చేసుకున్నాడన్నమాట నాతో వుండకూడదని వారం తిరక్కుండానే పోయాడు బాబూ"

పాపం! వెన్నెలలో అతని ముఖం ఎంతో భయంకరంగా కనిపించింది త్రాగుడుతో బాగా ఎర్రబారిన కళ్లల్లో నుంచి ప్రవాహంగా పారుతున్నాయి కన్నీళ్లు చటుక్కున లేచి, వస్తానని వెళ్లిపోయాడు

అదే ఆఖరుసారి నేను మేజరు రావు గార్ని చూడటం

పాపం ఏమైపోయాడో ఏమో ★


ఎప్పటికైనా
యమధర్మరాజు గారికే
మీ ఓటు!
గుర్తు గల పెట్టెలో
యమ్. ధర్మన్న గారికే మీ ఓటు
అప్పుడు ఇప్పుడు
M ధర్మన్న గారికే
మీ ఓటు

చూపు లో చూపు

# శ్రీరంగం నారాయణబాబు

సంజ్ఞ సరిహద్దున, లోమాంచాల లోయలోన, నీడలు కూడే చోట
గడియారపు ముండ్లజంట కడపటి కౌగిలిలో మత్తిలి మసకలాడే చోట
అగణిత గణిత చిహ్నాలు, ఆకాశపు శాఖలపై పొంచి, చంక్రమించే చోట
వివేకపు విరిగిన గద్దెపైన, అరాచకపు రాచరికాన
తలక్రిందుగ తపస్సు చేస్తున్నవాడు
జాడీ బీడీల చండహోమధూమ కుండలిలోంచి
ఖండిత ఖడ్గమృగాలు, గండర గండభేరుండాలు చూస్తున్నవాడు
ఆకలిని మేస్తున్నవాడు,
భూతా భూత జ్యోతిష్కుడు, సంతతాన్య చేతస్కుడు
అతడే ఊర్ధ్వరేతస్కుడు, హర్షా మర్షాలు లేని మహర్షి

ఉద్గ్రంథాలు తలదిండ్లుగ నాడునేడులు క్రీడించిన చింకి చాప
అప్సరసల సవాయిహోయి, స్వాప్నిక సంయోగాల స్వేదదుర్భర జాగరణాలు
కాశీమజిలీల కథల రాశీ భూత సురత శ్రమలు
పౌరాణిక పయోరియా ఊసే బోసి నోట కదలే కవితా క్రిములు
ఎండిన ఇసుకపై కోరిక కుంటిచేప

---

బైరాగి

---

అంతరంగపు టరలలో ఉపనిషత్తులు, మార్క్సు, ఫ్రాయిడు
వాత్స్యాయనుడు, హెవలక్ ఎల్లిస్, లీలావతి, అయినస్టీను, కాళిదాసు,
జేమ్సు జ్వాయస్,
ఆదిమ నిషాదుని విషాదానికి బీట నిక్కుల నిషా తోడు.
అవచేతనపు చెక్క రేలో, వయడిపస్ కాంప్లెక్సు
గర్భకోశపు ద్వీపటిలో, తల్లివంటి చీకటిలో
స్వరతి నిరత బాలకుడు, దోష కశాచాలితుడు.
అతని మనసు క్యూబిస్టు ట్యాబిలోను.

వెర్రి పీరులు, శివలింగాలు, సింధూర చర్చిత శిలలు
రక్తాంబర ధరు డాతడు, రాక్తాతుడు, ఆదిశక్తి ఆరాధకుడు.
జీవిత శ్మశానంలో కవితా శవ సాధన చేస్తున్నాడు
ఝల్లుమనే కంకాళాలు, ఘల్లుమనే కపాళాలు
గుహ్యాతాంత్రిక గుహాలలో భైరవమంత్ర ప్రతిరవాలు
ఆటవిక పటహ ఘోషలు, టోటెమ్లూ, ట్యాబూలూ
అగ్ని చుట్టు నర్తించే దిగంబర శూలధరులు
ఆఫ్రికాలో అర్ధరాత్రి

నిర్జన మానసాన అడుగుల సడి వడివడి మ్రోగ
నీడల్లో ఒదిగి ఒదిగి వస్తున్నాడు నేరస్తుడు,
హఠాత్తుగ, సందు మలుపు తిరుగగానే
బుగ్గ మీసాల పత్తేదారు 'హేండ్సప్' అని అరచాడు



# సమైక్యతా భావం



మనదేశం యొక్క ప్రత్యేక శక్తి ఏమిటి? ఆ శక్తిని పొంది ఉండటానికి అనేక కారణాలున్నాయి. అందులో మొదటిది; భౌగోళికమైనది, రెండోది: చారిత్రకమైనది; మూడోది: ఆదర్శాలకు సంబంధించినది.

భౌగోళికంగా భారతదేశం ఉత్తరాన హిమాలయాలు మొదలుకొని దక్షిణాన మహాసముద్రాల వరకూ ఒకటే "తమ్ వర్షం—భారతం—నమ—భారతి—యాత్ర—సంతతే" ఈ భూభాగంలో నివశించే వారందరకూ వారి సిద్ధాంతం, వర్ణం, మతం వేరైనా భారత దేశస్థులే. భారత భూమే వారి మాతృదేశం.

పూర్వకాలంలో సైతం ఇటువంటి సమైక్యభావం ప్రజలలో ఉండేది.

మహాభారత యుద్ధం పరిశీలించి చూసినా ఉత్తరం నుంచి దక్షిణం వరకూ ఉన్న ప్రముఖ జాతుల ప్రతినిధులందరూ కురుక్షేత్ర మహాసంగ్రామంలో పాల్గొనట్లు విశదపడుతుంది.

చారిత్రకంగా చూసినట్లైయితే భారతదేశంలో ఎన్ని జాతులో—ఎన్ని భాషలూ-ఎన్ని మతాలూ ఉన్నప్పటికీ ఇది పెద్దది, ఇది చిన్నది అనే భావం ఉండేదికాదు. అందరూ సమానంగా వర్ధిల్లటానికి అవకాశాలు కల్పింపబడేవి. ఏదో ఒక నమ్మకాన్ని రూపుమాపడం భారతదేశపు ఆదర్శంకాదు. అన్ని నమ్మకాలనూ సమన్వయపర్చడం దాని ఆదర్శం.

మనువు వంటి సనాతన సూత్రకారుడు సైతం "ఈ దేశంలో ప్రవేశించిన వారందరికీ, వారి వారి సాంప్రదాయాలే బోధింపబడతవి" అన్నాడు.

మన జాతిగాని, మతంగాని, వంశంగాని గొప్పదనే అహంకారం మన

డా. యస్ రాధాకృష్ణన్

కేనాడూ లేదు. వాటి చారిత్రక సాంప్రదాయాలను అర్థం చేసుకుని వాటి మనుగడకు అవకాశాలు కల్పించ డమే మనం అనుష్టించిన మార్గం.

ఈ విధంగా ప్రతి మార్గాన్నీ అంగీక రిస్తూ, దేన్నీ నిర్మూలించకుండా ప్రతి దానిలోనూ ఏదో ఒక విలువను కని పెడుతూ పురోగించడమే మనదేశ చరిత్ర యొక్క నియమం.

ఈ దృష్టి విశాల దృక్పథం వల్ల, ఆధ్యాత్మిక స్పృహవల్ల పరిఢవిల్లింది. ఇటువంటి దృష్టి మహమ్మదీయ మత గ్రంథమైన 'కొరాన్' లోనూ కని పిస్తుంది. ఆ గ్రంథంలో "ఓ మానవు ల్లారా! మిమ్మలను ఒక జంటనుంచి ఒకరి నొకరు తెలుసుకునే అవకాశం కల్గించ గలందులకు జాతులుగానూ, కులాలుగానూ వర్థిల్లేటట్లు చేశాం గాని ఒకరి నొకరు ఏవగించుకునేందుకు కాదు" అని ఉన్నది.

కాబట్టి సర్వమత సమన్వయం మన ఆదర్శం—

మన చరిత్రలో ప్రసిద్ధికెక్కిన ఘట్టా లలో గాఢమైన సానుభూతిని, ఓర్పును మనం పొంది ఉండే వాళ్ళం అనే సంగతి గమనించ వలసిన అంశం. అశోకుడు ఇతర దేశాలకు రాయ బారులను పంపేవాడు. ఐకమత్యమే మానవ ధర్మమని ప్రచారం చేసే వాడు. శిలలమీద "సమవాయ–ఏవ–సాధు" అని చెక్కించాడు. దీనివల్ల ఆయన దృష్టి ఎంత విశాలమైనదో మనకు బోధపడుతుంది. గుప్తుల కాలంలో ఫాహియాన్ అనే చైనా యాత్రికుడు పది సంవత్సరములు మనదేశంలో గడిపి, "నన్ను ఎక్కడికి బడితే అక్కడికి వెళ్ళనిచ్చే వారు. ఏది పడితే అది చేయనిచ్చే వారు. 'మిగిలిన మతాల కంటే తమ మతం గొప్పది' అనే అహంకారం వారికి లేక పోవడమే ఇందుకు కారణం" అని చెప్పాడు. హర్షవర్ధనుడు కూడా ఇటు వంటి స్వతంత్ర దృష్టినే అనుస రించాడు.

ఇక అక్బర్ సంగతి మనందరికీ తెలిసిన విషయమే. "భావస్వాతంత్ర్యా నికి పరిపుష్టిని కలిగించే సూత్రాలను, జాతి, మత భేదం లేని న్యాయాన్నీ ఆయన ప్రతిష్టించాడు. అందరి కష్టా లనూ నివారించడానికి ఆయన ప్రయ త్నించాడు. అన్ని మతాలనూ దగ్గరకు తీసుకు రావటానికి ఆయన కృషి చేశాడు" అని ఆయనను గురించి చెప్ప బడింది.

ఈ విశాల దృష్టిని కోల్పోయిన నాడు మనదేశం పతన మయింది. మన దేశం యొక్క దురదృష్టం మనకు నేర్పే పాఠం యిది: ప్రజలలో సాను భూతిని, సహిష్ణతను పెంపొందించి

నప్పుడే మన భావి భాగ్యోదయ విలసిత మవుతుంది.

మన రాజ్యాంగం లౌకికనీతి మీదే నిర్మించబడినప్పటికీ మతం అనేది మానవ స్వభావంలో వుంది అభివృద్ధి చెందాలని మానవుడు నిరంతరం అపే క్షిస్తాడు ఎప్పటికప్పుడు యింకా ఎక్కువగా తెలుసుకోవాలనీ, సౌందర్య సృష్టి చేయాలని మానవుడు అపే క్షిస్తాడు అంతేగాని ఏదో ఒక మతం ఈ ఆదర్శాన్ని సాధించగలదని మనం ఎప్పుడూ చెప్పలేదు

ఈనాడు కూడా ఇటువంటి విశాల మైన దృక్పథాన్నే మనం ప్రతిపా దిస్తున్నాం ఏ మతస్థుడైనా తన విశ్వా సాన్ని ఆచరణలో పెట్టుకోవచ్చు తన సూత్రాలను అనుసరించవచ్చు ఐతే ఈ విశ్వాసాలూ, సూత్రాలు యితరు లకు ప్రమాదం కలిగించకూడదు యితరుల మనస్సులను నొప్పించ కూడదు మత సిద్ధాంతాలూ, రాజ కీయ విశ్వాసాలూ కలగా పులగం కాకూడదని మన కోరిక అలా జరిగి నప్పుడల్లా మనదేశం వినాశనానికి గురైంది ఇటువంటి ఆపత్తు ఇక ముందు జరగ కూడదని మన సంకల్పం మానవు లందరూ సహోదరులేనని మన ధర్మ శాసనం చెబుతోంది అటు వంటి ఐకమత్యం మానవ ప్రవర్తనకు పునాదిగా వుండాలి

జాతీయ ఐకమత్యం ఎక్కడనుంచో ఊడిపడేదీ కాదు—ఒక్కసారిగా లభిం చేదీ కాదు మానవుల హృదయాల లోనూ,మనస్సులలోను రూపొందాలి ఇది విద్యా విధానంవల్ల మాత్రమే లభిస్తుంది దీని పురోగమనం వేగంగా ఉండక పోవచ్చును నెమ్మదిగా వున్నా శాశ్వతంగా ఉంటుంది

నేడు మనం చరిత్రలో అతి ముఖ్య మైన సంధియుగంలో కాలు పెట్ట బోతున్నాం ఎక్కడికక్కడ గోడలు కూలి పోతున్నాయి అవరోధాలు అంతరిస్తున్నయ్ ఒక విశ్వ మానవ సృష్టిని మనం వృద్ధి చేసుకుంటున్నాం మనం మార్పును కోరినప్పుడల్లా వ్యతి రేకత ఉండేదే సంధియుగం విషా దాంతం గానే వుంటుంది ఎందుకంటే అంతకు ముందు మనం వదిల పెర్చుకో వాల్సిన నమ్మకాలను ఒదులుకోవాల్సి వస్తుంది గనుక కాని ఈ విషాదాన్ని ఎదుర్కొని అధిగమించడం మన కర్తవ్యం ఆ విధంగానే మనం నిజమైన నాగరికతనూ, నిజమైన ప్రజాస్వామిక విధానాన్ని సాధించ గలుగుతాం

మనం అనేక ఘన విజయాలను చేపట్టటానికి కలిసి పని చేశాం స్వాతంత్ర్యాన్ని కలిసి సాధించాం భవిష్యత్తు నిర్మాణానికి యిదే విధంగా కలిసి పనిచేసినప్పుడే జయశ్రీని చేపట్ట గలుగుతాం ★

# మధ్వాచార్యులు

శంకరాచార్యులు సృష్టించిన అద్వైత తత్వాన్ని రామానుజులు కొంతవరకు సడలించారు వారు పరిపూర్ణ భావాన్ని అంగీకరిస్తూ కొంత భేద భావాన్ని ప్రవేశపెట్టారు ఈ భేద భావాన్ని పూర్తి చేశారు మధ్వాచార్యులు వారు అద్వైత తత్వాన్ని పూర్తిగా వ్యతిరేకించి, పంచ భేదాలను సమర్థించారు ఆ పంచభేధా లివి, భగవంతునికీ జీవాత్మకే ఉన్నభేదం, భగవంతునికీ పదార్థానికి ఉన్నభేదం, జీవాత్మకు పదార్థానికి వున్నభేదం, జీవాత్మకూ – జీవాత్మకూ వున్న భేదం; పదార్థంలో ఉన్న ఒక భాగానికీ, మరొక భాగానికీ ఉన్న భేదం వారీ భేదాలను అంగీకరించడమే కాక 'ఇవి శాశ్వితమైనవి' అని కూడా చెప్పారు మధ్వాచార్యులు ఉడిపి బ్రాహ్మణులు వారు 1199 లో ఉడిపికి ఆటమైళ్ళ దూరములోనున్న బెల్లె అనే గ్రామంలో జన్మించారు. 25 వ సంవత్సరంలో ఆయనకు సన్యాసాశ్రమం స్వీకరించాలనే అభిప్రాయం కలిగింది. అచ్యుత ప్రేక్షకులు అనే మునిసత్తముడు ఈ క్రతువుకి అధిపత్యం వహించారు

అచ్యుత ప్రేక్షకులు అద్వైత వాదులు త్వరలోనే మధ్వాచార్యులు గురువుని వ్యతిరేకించి, ద్వైత సిద్ధాంతాన్ని సృష్టించి ప్రచారానికి పూనుకున్నారు మధ్వాచార్యుల దృష్టిలో తెలుసుకునే వాడు, తెలుసుకోబడేది లేకుండా జ్ఞానం ఉండటానికి వీల్లేదు తెలుసుకునేవి, తెలుసుకోబడేవి ఉండి తీరాలి ఈ ప్రపంచం అవాస్తవికమైనది కాదు వస్తువులలో ఉన్న భేదాలను అంగీకరించకపోతే భావాలలో ఉన్న భేదాలకు కారణం చెప్పలేం వస్తువులలో ఉన్న ప్రత్యేకతే విభిన్న కారణాలకు కారణం

మధ్వాచార్యులు ఈ విధంగా ఆలోచించి మన ఇంద్రియాలను, శక్తులనూ సరిగ్గా వినియోగపర్చడం ద్వారా తెలుసుకున్నవన్నీ సత్యానికి సంబంధించినవే నని నిర్ధారించారు

ప్రపంచంలో ఉన్న భేదాలను ఉన్నవానిని ఉన్నట్టుగ గమనంలోకి తీసుకుని శాస్త్ర వృష్టి చేసిన తత్వవేత్త మధ్వాచార్యులు

---



పగలు - రేయి



"అందమెరిగిన వాడవు; కన్నీటినే అతివ అందమంటావు, రసగిరుల విలువల్లో కన్నీరే హిమశిఖరి దాటునంటావు, ఏమిచేసినా నీదానను గద !......" అంటుంది

రాగరమ ముఖారి

# సినిమా క్విజ్







పై నాలుగు బొమ్మల్లో నాలుగు సినిమాల పేర్లు తెలియజేస్తవి  ఏమిటవి?

(జవాబులు 70 వ పేజీలో)

సాయంత్రం దాదాపు ఆరు కావస్తూ వుంది నేను, పరీక్షలు దగ్గరకు రావటం వల్ల పుస్తకం పట్టుకుని దీక్షగా చదువుకుంటున్నాను ఇంతలో వాకిట్లోంచి "అమ్మా పాలు పితుకుతున్నాను, రండమ్మా" అని పాలతను కేకలు పెట్టాడు పనితో సతమత మవుతున్న అమ్మ, నన్ను కేక వేసి "వెళ్ళి పాలు పట్టుకురా అమ్మడూ, నేను పని తొందరలో వున్నాను" అన్నది పాలు పితికేటప్పుడు దగ్గర వుండక పోతే పాల వాళ్ళు నీళ్ళు కలుపుతారని ఆమె భయం. నేను విసుక్కుంటూ పుస్తకం టేబులుమీద పడవేసి వంటింట్లోకి వెళ్ళి గిన్నె తీసుకుని బయటకు వెళ్ళాను.

నేను వెళ్ళేటప్పటికి నౌకరు పాలు పిండుతూ వున్నాడు. పాలతాత మెట్ల మీద కూర్చుని చూస్తూ వున్నాడు "నాకు చెంబు చూపించకుండానే పిండిస్తున్నావేం తాతా?" అని అడిగాను

"నువ్వు వచ్చేసరికి బక్కెట్టు చేపిందమ్మా అందుకని పిండిస్తున్నా" అన్నాడు పాలతాత.

"ఊఁ హూఁ, అయితే యెన్ని నీళ్లు కలిపారేంటీ" అన్నాను యెగతాళిగా.

నేను ఆ మాట అనగానే పాలతాత ముఖం వివర్ణం అయ్యింది. "బుల్లెమ్మా. బుల్లెమ్మా.



# పశ్చాత్తాపము

నన్ను ఆ మాట మాత్రం అనకమ్మా" అన్నాడు పాలతాత

అతని కంఠంలో ఆవేదన ధ్వనిస్తూ వున్నది నాకు పాలతాతమీద జాలి కలిగింది.

"నేను ఆ మాట అనగానే అలా అయిపోయావేం తాతా? మీ పాల వాళ్ళందరూ కల్తీలేని పాలే పోస్తున్నారేమిటి?" అని అడిగాను.

'నేను అలా అన్నానా తల్లీ బుద్ధి లేని యెదవలు నువ్వన్నట్లుగానే చేస్తారమ్మా. చేసే పాపాలకు ముందు ముందు అనుభవించబోయే ప్రతిఫలాన్ని గురించి యేమాత్రమన్నా తెలిస్తే యెవరూ మోసం చెయ్యరమ్మా. తెలిసి తెలిసి గోతిలో దిగే వాళ్ళెవరన్నా వుంటారా అమ్మా' అన్నాడు తాత

"ఓ హో! అయితే నువ్వు ముందు ముందు అనుభవించబోయే ప్రతిఫలాన్ని గురించి తెలుసుకొని, పాలలో నీళ్ళు కలపటం మానివేశావన్నమాట?" అన్నాను హేళనగా

నేను ఆ మాట అనగానే పాలతాత కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి

''లేదు తల్లీ! జరగవలసిన దంతా జరిగిపోయింది ఇప్పుడు వున్న జ్ఞానం అప్పుడు వుండి వుంటే నా జీవితం ఈనాడు ఇంత అధ్వాన్నంగా వుండేది కాదమ్మా చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నట్లు జరగవలసిం

ప్రమీలా దేవి

దంతా జరిగిపోయిన తరువాత యెంత బాధపడితే మాత్రం యేం ప్రయోజనం తల్లీ" అన్నాడు తడబడుతున్న మాటలతో

అతని బాధ చూచి నేను అతనిని హేళన చేసినందుకు చాలా బాధపడ్డాను అతనిని సముదాయించాలనే వుద్దేశంతో "అయితే, యింతకు ముందు నీ జీవితంలో అనుకోని సంఘటన లేమైనా జరిగాయా ?" అని అడిగాను.

"అవునమ్మా ఆ సంఘటనలే నా గర్వాన్నీ, అహంభావాన్నీ, కాపట్యాన్నీ అణిచివేశాయమ్మా", అన్నాడు గద్గదికంగా

నాకు ఆ పాలతాత జీవితాన్ని గురించి తెలుసుకోవాలనే వుత్సాహం కలిగింది. "అయితే నీలో మార్పు తెచ్చిన సంఘటనలు యేమిటో నాకు చెప్పవా ?" అని అడిగాను

"ఆ రోజులు తలుచుకుంటే నా మీద నాకే అసహ్యం వేస్తుందమ్మా ఆ రోజుల్లో యెన్నో మోసాలు చేశాను మీలాంటి వాళ్ళు కాపలా వేసుకు కూర్చున్నా కూడా యెంతో తెలివిగానూ, నేర్పుగానూ, పాలలో నీళ్ళు కలిపే వాడినమ్మా అంతేకాదు, కొందరికి మంచి మాటలు చెప్పి పొడరు పాలుకూడ పోశే వాడిని. ఈ కల్తీపాల మీద వచ్చే డబ్బుతో వడ్డీ వ్యాపారము చేసేవాడిని వడ్డీల మీద వడ్డీలు వేసి యెన్నో కాపరాలను కూల్చాను ఆ రోజుల్లో నాలో రాక్షసత్వం తప్ప మానవత్వం యే కోశానా వుండేదికాదు అందరి ఇళ్ళూ కూల్చి, ఆ పాపపు సొమ్ముతో వొక యిల్లూ, రెండు యెకరాల పొలం కొన్నాను '' తాత కళ్ళనుంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి పైపంచతో కళ్ళు తుడుచుకుని ఇలా అన్నాడు

"అంతేకాదు నా జీవనాధారా లయిన ఈ నోరులేని జీవాలను నానా హింసలు పెట్టేవాడిని వాటికి తిండి సరిగ్గా పెట్టకుండా వాటి నుంచి యెక్కువ లాభాలు పొందాలని తాపత్రయపడే వాడిని ఏనాడన్నా యే గేదన్నా పాలు ఇవ్వకుండా మొరాయించిందా, ఆ నాడు దాని తాటరేగిపోయే వరకూ చితకతన్నే వాడిని. నా దెబ్బల బాధకు తట్టుకోలేక ఆ మూగ జీవాలు "నీకేం అన్యాయం చేశాం ? మమ్మల్నెందు కిలా బాధపెడతావు"అని మొర పెట్టుకున్నట్లుగా, అంబా అని ఆక్రోశించేవి కొట్టవద్దని బ్రతిమిలాడుతున్నట్లుగా నా వైపు దీనంగా చూసేవి అప్పుడు ఈ పొరలు కప్పిన కండ్లకివేవీ కనుపించేవి కాదమ్మా వీలైనంతవరకూ వాటిని బాధించి, వాటి రక్తం పిండి డబ్బు సంపాదించేవాడిని ఆ నాడు వాటి ప్రాణమూ, మన ప్రాణం లాంటిదేననీ, వాటికీ మనలాగే కష్టసుఖాలు వుంటాయనీ అనిపించేది కాదు

తల్లీ" అని నిట్టూర్చి కొంతసేపు ఆగి మళ్ళా చెప్పడం మొదలు పెట్టాడు

"ఆ రోజుల్లో నాకు, నీ వయసు కూతు రొకతీ, దానికన్నా రెండేళ్ళు చిన్నవాడైన కొడు కొకడు వుండే వారమ్మా భగవంతుడు వాళ్ళిద్దర్నీ రెండు రత్నాల్లాగా నాకు ప్రసాదించాడు కాని యేం లాభం? ఆ రెండు రత్నాలనీ నేను దక్కించుకోలేక పోయానమ్మా" ఈ మాట చెప్పి, దుఃఖపు తెరలు గొంతును అడ్డుకోవటం వల్ల ఒక్క క్షణం ఆగాడు గొంతు సవరించుకుని, దుఃఖం దిగమింగి మళ్ళా మొదలు పెట్టాడు

"నేను చేసే మోసాలను, అన్యాయాలను చూచి నా కూతురూ, కొడుకూ 'ఇలా నిన్ను నమ్మిన వారిని మోసం చెయ్యకు నాన్నా మన ప్రవర్తన మంచిదైతే భగవంతుడు మనని ఆదరిస్తాడు మనం ఇతర్లను మోసం చేస్తే భగవంతుడు మనని మోసం చేస్తాడు నువ్వు పోసే ఈ పాలు యెందరో పసిపిల్లలకు పడతారు వారు భగవత్స్వరూపులు ఆఖరికి మనం ఆ పసిపాపలను కూడా మోసం చేసిన పాపానికి గురిఅవుతాము నాన్నా నీ వడ్డీల వల్ల యెన్ని కాపరాలు కూలిపోతున్నాయో చూడు ఏ నాటి కైనా వారందరి వుసురూ మనకు కొట్టకపోదు నాన్నా' అని చిలకకి చెప్పినట్లు చెప్పేవారు.



"నాకు పది నిమిషాలు గడువివ్వండి చప్పున నాలుగు జేబులుకొట్టి, మీ పదిహేను రూపాయల జుల్మానా చెల్లిస్తాను."

కాని నా పాషాణ హృదయాన్ని ఆ మంచి మాటలు కరిగించలేక పోయ్యాయి నా దిబ్బిళ్ళు వేసిన చెవులలోకి ఆ తియ్యటి మాటలు అసలు దూరనేలేదు. కాని తరువాత దాని ఫలితం అనుభవించాను

'నా కూతుర్ని యెనిమిదో తరగతి వరకు చదివించి, నా మేనల్లుడికిచ్చి పెళ్లి చేశానమ్మా పెళ్ళయి రెండేళ్ళయినా తిరక్కముందె, వాడు పొలంలో పని చూచుకుని ఇంటికి వస్తూవుంటే పిడుగు పడి చచ్చిపోయాడు నేను దుఃఖించాను కాని ఆ సంఘటన నాలో కొంత బాధను మాత్రమే కలిగించింది నాలో సంపూర్ణమైన పరివర్తన కలిగించలేక పోయింది

ఆ తరువాత ఆరు నెలలు గడవక ముందే నా బిడ్డ తీర్థమాడలేక మమ్మల్ని వదలి వెళ్ళిపోయింది పోయేముందు నన్ను, తమ్ముణ్ణీ దగ్గరకు పిలచి, పసివాడిని తమ్ముడి చేతుల్లోపెట్టి'తమ్ముడూ,

వీడిని నీలాగా, నీతి, నిజాయితీ గల మనిషిగా చెయ్యరా' అన్నది. తరువాత నాతో 'నాన్నా, యెవర్నీ మోసం చెయ్యకు నాన్నా' అని కన్నీరు జల జలా రాలుస్తూ ప్రార్థించింది అంతే, దానికీ నాకు ఆ నాటితో ఋణం తీరి పోయింది

నా బిడ్డ మరణం నాలో పెద్ద సంచలనాన్ని లేవదీసింది నా పిల్లలు చెప్పినట్లు నేను చేస్తున్నపని మంచిదికాదేమో అన్న సందేహం మొట్టమొదటిసారిగా నాకు కలిగింది నా అన్యాయమే నన్ను తిప్పికొడుతూ వున్నదేమో అనిపించింది నేను కొంతవరకు మారాను కాని మోసాలతోను, అన్యాయ తోను కరుడు కట్టిన నా మనసు ఆ పెడదారిలో నుంచి మంచి దారిలో పడలేదు

నా కూతురు పోయిన యేడాదే నా కొడుకు మిలిటరీలో చేరి ఢిల్లీ వెళ్ళి పోయాడు నేను నా మనవడిని పెంచుతూ, వ్యాపారం చూసుకుంటూ ఇక్కడే వుండిపోయాను మిలటరీలో చేరిన యేడెనిమిది నెలల తరువాత నా కొడుకు ఒక్కసారి పసివాడిని చూడటానికి వచ్చాడు ఎచ్చేటప్పుడు మేనల్లుడి కోసం రకరకాల ఆట వస్తువులు తెచ్చాడు వాడిని యెత్తుకుని ఫొటో తీయించుకుని "ఒరేయ్ బుజ్జీ మల్లా నేను యెప్పుడు వస్తానో యేమో! కాని ఈ ఫొటో మాత్రం జేబులో పెట్టుకుని అన్ని వేళలా నువ్వు నా పక్కనే వున్నట్లు సంబర పడతారా'' అని చెప్పాడు పసివాడితో వాడు మామ మాటలన్నీ అర్థమైనట్టే నవ్వాడు

ఆనాడు ఆ స్థితిలోవున్న వాళ్ళిద్దర్నీ చూడగానే నా మనస్సెందుకో కలుక్కుమన్నది. మరొక పది రోజుల తరువాత వాడు ఢిల్లీ వెళ్ళిపోయాడు

వెళ్ళేటప్పుడు ''నాన్నా! ఇప్పటికైనా నా మాట విని ఈ అక్రమ వ్యాపారం మానేసెయ్యి డబ్బు కోసం ఇట్లా వక్ర మార్గాలలో నడవటం మంచిదికాదు నాన్నా నీకు కావలసిన డబ్బు నేను పంపిస్తాను, నువ్వు మాత్రం ఈ అన్యాయాలు, మోసాలు చెయ్యటం మానేసెయ్యి నాన్నా" అన్నాడు బ్రతిమాలుతూ

''ఆ(...అన్నీ చేసేవాడివి బయలు దేరావులే నీ సంగతి నువ్వు చూసుకో." అని నేను చీదరించుకున్నాను కాని లోపల వాడు చెప్పేదాంట్లో సత్యం వున్నదనిపించింది పైకి మాత్రం అలవాటు చొప్పున వాడిని విదిలించుకున్నాను

''సరే, నీ యిష్టం అబ్బాయిని మాత్రం జాగ్రత్తగా చూస్తూవుండు నాన్నా'' అన్నాడు

నాకు వాడు చెప్పిన ఆఖరి మాటలు అవేనమ్మా వాడు వెళ్ళి మూడు నెలలైనా తిరక్కముందే యుద్ధంలో పోయాడని నాకు వార్త వచ్చింది నేను ఆ వార్త వినగానే కుప్పగా కూలిపోయాను నా జీవితం అంతా చీకటయిపోయిందమ్మా ఎక్కడ కూర్చున్నా,యెక్కడనుంచున్నా "మనం ఇతర్లని మోసం చేస్తే భగవంతుడు మనని మోసం చేస్తాడు" అన్న అమ్మాయి మాటలు, "నా మాట విని ఈ అక్రమ వ్యాపారం మానేసెయ్యి నాన్నా" అన్న అబ్బాయి మాటలు, నా చెవుల్లో గింగురుమని ప్రతిధ్వనిస్తూ వుండేవి ఆ మాటలు నన్ను పిచ్చివాడిని చేశాయి నేను అందరినీ చేసిన మోసానికి ప్రతిమోసంగా భగవంతుడు నా బిడ్డల్ని నా నుండి వేరు చేశాడమ్మా వాళ్ళని అలా సాగనంపి నేను మోడులాగా బ్రతుకుతున్నానమ్మా " అన్నాడు దుఃఖంతో వణికిపోతూ నేను నిశ్శబ్దంగా వింటూ నుంచున్నాను.

"అప్పటి నుంచి నేను యెవ్వర్నీ మోసం చెయ్యకూడదనీ, నా మంచి ప్రవర్తనతో నా బిడ్డల ఆత్మలకు శాంతి కలిగించాలనీ నిశ్చయించుకొని అలాగే కాలం వెళ్ళబోస్తున్నానమ్మా. అసలా రోజుల్లో నాకు చచ్చిపోదామనిపించిందమ్మా కాని నా మనమడు దిక్కులేని పక్షిలాగా అల్లాడిపోతాడని, ఈ మోడు బారిన జీవితాన్ని ఇట్లా కొనసాగిస్తున్నానమ్మా. ఇప్పుడు వాడూ, ఈ నోరు లేని జీవాలే నా ప్రపంచం తల్లీ నేను చేసిన పాపాలకు అనుభవించిన ప్రతిఫలం చాలమ్మా ఇక ఈ జన్మలో యెవర్నీ కూడా యెటువంటి పరిస్థితులలోను అన్యాయం గాని, మోసం గాని చెయ్యనమ్మా గడిచిన కాలం గడవగా మిగిలినదాన్ని మంచిగా గడుపుతానమ్మా." అన్నాడు తాత కళ్ళు తుడుచుకుంటూ.

"ఇంతలో జీతగాడు పిండిన పాలు తెచ్చి పాలతాత చేతికిచ్చాడు తాత పాలు కొలిచిపోస్తూ "నేను ఇంట్లో వుండి, జీతగాళ్ళని పాలు పొయ్యటానికి పంపవచ్చమ్మా కాని కక్కుర్తి యెదవలు యెక్కడ యే నీళ్ళు దొరికితే ఆ నీళ్ళు పాలలో కలిపి చస్తారమ్మా. అందుకే నేనూ వీళ్ళెంట పడివస్తాను వీళ్ళని కనిపెట్టి వుండకపోతే లాభం లేదమ్మా "

లోకంలో మనుష్యులనుకునే వారందరికీ, ఈ తాతకు వున్న పశ్చాత్తాపం వుంటే యెంత బాగుండును కుట్రలకు మోసాలకు, అతీతంగా వుండి అంతా హాయిగా బ్రతకవచ్చు అనిపించింది నాకు.



# దేవుళ్లపాట్లు




"ఇదేంటర్రోయ్ గ్రహ దేవుళ్లూ! అంతా కలిసికట్టుగా నా కొంపకి వొచ్చి పడ్డారు!! ఎన్నికల గొడవ మీకూ తగిలినట్టుందే   నా కుంటి కర్రతో మీకెన్ని ఓట్లు కావాలంటే అన్ని ఓట్లు వడ్డించటానికి నే నెప్పుడూ సిద్ధమే"

"శనీశ్వరా! మేం వోట్లుకోసం రాలేదు. ఏకగ్రీవంగా మా అందరి ఓట్లూ నీకే వేసి మా ఏకైక మహానాయకుడిగా నిన్ను ఎన్నుకొంటున్నాం; ఆ భూమ్మీది ఉద్దడ పిండాలు ఏ క్షణాన మాలో ఎవరి మీద ఎలాంటి దండయాత్ర చేస్తారో తెలీకండా ఉంది ఇలాంటి విపత్సమయంలో నీ అండ కంటే వేరే దారిలేదు గ్రహమహానాయకా! పాల ముంచినా నీళ్ళ ముంచినా నీదే భారం శనీశ్వరా!"

# తిండికి లేని వాళ్ళు





హరీంద్రనాధ్ చౌద

ఈ పేజీలో నెలనెలా తిండికిలేని వాళ్ళను గురించి వ్రాద్దా మనుకుం టున్నాను. ఈ సంచికలో ప్రపంచంలో ఎంతమంది తిండిలేని వాళ్లు వున్నారో, వాళ్లను బాగు చెయ్యటానికి ఏమేమి ప్రయత్నాలు జరుగు తున్నాయో విచా రిద్దాం.

ప్రపంచంలో వున్న జనాభాలో సగం మందికి సరైన తిండిలేదు ఇది ఆశ్చర్య కరమైన విషయమే అయినా సత్యమే। అంతే కాదు, మిగిలిన వారిలో ఎక్కువ మందికి పొట్ట నింపుకోటానికి తిండి దొరికినా, సమగ్ర ఆహారం దొరకటం లేదు

ప్రపంచంలో పెద్దపెద్ద తత్వవేత్తలు వున్నారు రాజకీయ, ఆర్థిక శాస్త్రవేత్తలు వున్నారు సంఘ సంస్కర్తలూ, సాంఘిక సేవకులూ వున్నారు అయి నప్పటికీ పరిస్థితి ఈ విధంగా వుండటం విచిత్రంగా లేదూ ?

విచిత్రంగా లేకపోవటం ఏమిటి ? తలుచుకుంటే గుండె గుభేలు మంటూ వుంటేను! ఈ పరిస్థితి చూస్తుంటే ఈ ప్రపంచ రథానికి ముఖ్యంగా వుండ వలసిన సీల వూడిందేమో నని అనిపిస్తూ వుంది. మన దేశాలవంటి దేశాల్లో జనం ఇళ్ళల్లో కంటే పేవ్ మెంట్ల మీదే బ్రతకటం నిత్యం చూస్తూనే వున్నాం. ఎంతటి భయంకర దారుణ దృశ్యాల నైనా అలవాటు చేసుకునే మనుష్యులకు అలవాటు చేసుకునే గుణం మనుష్యులు వుండబట్టిగాని, లేకపోతే అవమానంతో కుళ్లి, సిగ్గుతో చివికి మరణించవలసిన పరిస్థితి ఇది.

అయితే ఈ పరిస్థితిని మార్చటానికి ఇటీవల చాలా ప్రయత్నాలు జరుగు తున్నమాట కూడా నిజమే వాటినికూడా పరిశీలిద్దాం.

ప్రభుత్వం, రైతులకు ప్రోత్సాహా న్నిచ్చి,నూతన పరికరాల ఉపయోగాన్ని నేర్పి అధికంగా ఉత్పత్తి చేయించ టానికి కృషిచేస్తూ వుంది ఎరువులు మొదలైనవి సరఫరా చేసి, శాస్త్రీయ సేద్య విధానాన్ని ప్రవేశపెట్టి, పోరం బోకులనూ, అడవులనూ సేద్యార్హం చేసి అధికంగా ఉత్పత్తి అయ్యే అవకాశాలను కల్పిస్తూ వుంది

మానవులకు ఆహారం భూమినుంచే కాక పశువుల నుంచికూడా అందుతూ వుంటుంది అందుకని ప్రపంచంలోని

ప్రభుత్వాలు పశుపోషణకు కూడా పూను కున్నాయి. అందుకు అనేక బంజరు భూముల్లో పశుగ్రాసాన్ని పెంపొందించ టానికి పథకాలను తయారు చేసినై. పశువులు రోగాలతో ఈసురోమని బ్రతుకును ఈడ్చుకోకుండా వాటి ఆరోగ్యం కాపాడటానికి అనేక చికిత్సా కేంద్రాలను నెలకొల్పినై.

కొన్ని ప్రభుత్వాలు మురికి కూపాలను ఎండిన భూములుగా మార్చినై. ఉదాహరణకు గ్రీకు ప్రభుత్వాన్ని తీసుకుందాం. ఆ ప్రభుత్వం తమ దేశంలో వున్న రొంపి భూములను సేద్యార్హం చెయ్యటం వల్ల ఉత్పత్తి అరవై శాతం పెరిగింది.

దీనితో పాటు మనం తీసుకునే ఆహారం యొక్క స్వభావాన్ని మార్చటానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆహారంలో మాంసకృత్తులూ, విటమిన్లూ ఎక్కువగా ఉండగలందుకు మాంసాహారంతో పాటు, మత్స్యపోషణ పట్ల కూడా శ్రద్ధవహించ బడుతూ వుంది. ఆహారంలో పోషక పదార్థాలు తక్కువగా వున్నచోట్ల విటమిన్ తయారీలతో ప్రజల ఆరోగ్యం కాపాడటానికి వసతులు కల్పించ బడుతున్నాయి. ఒక సంస్థ నలభై అయిదు విటమిన్ పదార్థాలను తయారు చేసిందంటే ఈ ప్రయత్నం ఎంత నిర్విఘ్నంగా కొనసాగుతూ ఉందో మనం ఊహించుకోగలం.

కాని ఈ ప్రయత్నాలకు తగిన ప్రతిఫలం బీదలు పొందుతున్నట్లు కనపడటం లేదు. ఎందుకని? సంఘంలో ప్రభుత్వాలు సృష్టిస్తున్న ఈ అవకాశాలను వినియోగించుకునే వీలు ధనవంతులకూ, అదృష్టవంతులకే వుండటం ఇందుకు ముఖ్యకారణం.

సంఘంలో ప్రత్యేక హక్కులను అనుభవించేవారి దృష్టి మారనంత వరకూ ఏదోవొక విధంగా ప్రభుత్వం బీదలకని కలుగజేసే వసతులను వారే తమ స్వార్థానికి వినియోగించుకుంటారు. నేటి ప్రపంచంలో ఈ పనే జరుగుతూ వుంది. కాగితాలమీద బీదల శ్రేయస్సుకై వేసిన పథకాలు అనేకం కనపడతై. అవి కంటికి ఇంపుగా కూడా కనబడతై. కాని తీరా అవి ఆచరణలోకి వచ్చేటప్పటికి వాటివల్ల వచ్చే లాభాలు మధ్యలోనే హరించిపోతున్నయి. సంఘంలో ధనవంతులు పెరుగు తున్నారు. బలుస్తున్నారు. బీదవాళ్లు, బీదవాళ్లుగానే వుంటున్నారు. బ్రతుకులను ఈడుస్తున్నారు.

ప్రభుత్వం అనుసరిస్తున్న అభివృద్ధి కార్యక్రమాల వల్ల వాళ్లకు అప్పుడప్పుడూ మాంసంలేని ఎముకలు మాత్రమే అందుతున్నాయి. ఈ పరిస్థితిని విపులంగా పరిశీలిద్దాం.

(సశేషం)

# పండిత మదన్ మోహన్ మాలవ్య



"యావద్భారత దేశం పూజించే మాలవ్యాజీ గతించారు. మాలవ్యాజీ కలకాలం వర్థిల్లుగాక"— అని గాంధీజీ అన్నారు.

"ఆయన యౌవన ప్రారంభంనుంచి పండిన వృద్ధాప్యం వరకు చేసిన అఖండ కృషియే ఆయనను అమరజీవిగా చేసింది. ఆయన సేవ బహుముఖాల విస్తరిల్లి నప్పటికీ బనారస్ హిందూ విశ్వవిద్యాలయం ఆయన బ్రహ్మాండ మైన సృష్టిగా ఎల్లకాలం పరిగణింప బడుతుంది.

బ్రహ్మాండమైన ఆ నిర్మాణం యొక్క ప్రతి ఇటుకా హైందవ ధర్మాన్నీ, సంస్కృతినీ ప్రతిఫలిస్తూ ఉంటుంది. మనకి ఇప్పుడు సన్నిహితంగా ఉన్న పాశ్చాత్య అనాత్మకత ఏ రూపం లోనూ కనపడదు. అది హైంద వాత్మ స్వరూపాన్ని ప్రతిఫలిస్తూ ఉంటుంది. మాలవ్యాజీ ఆత్మీయులూ, అనుచరులూ విశ్వవిద్యాలయ నిర్వ హణలో స్వర్గీయ మాలవ్యాజీ ఆశ యాలకు అనుగుణంగా నిర్వహించడం వారి విధి.

కాశీ విశ్వవిద్యాలయం మాలవీ యాజీ తన స్మారక చిహ్నంగా తానే నిర్మించుకున్నారు. దానిని కట్టుదిట్టం చేసి వృద్ధిచేయడమే మాలవ్యాజీ స్మృతి చిహ్నానికి శాశ్వతత్వం చేకూ ర్చడమన్న మాట. ధన సహాయంకోసం ఆయన నిర్విరామకృషి చేశారు. ఆ కృషి మనం సాగించాలి.

నిరుపమానమైన స్వచ్ఛత ఆయన జీవితంలో మూర్తీభవించింది. దయకు నిధి ఆయన. మత సంబంధమైన ధర్మ విజ్ఞానం ఆయనలో ఎక్కువ. వంశానుగతంగా ఆయన మత బోధ కుడు. అసాధారణమైన జ్ఞాపక శక్తి ఆయనది. ఆయన జీవితం ఎంత స్వచ్ఛ మైనదో, అంత నిరాడంబరమైనది. ఆయన రాజకీయాల మాట అటు

ఉంచి అనేక కార్యక్రమాలలో ఆయన నిరంతర నిస్స్వార్థ సేవ అనంతమైనది ఆయన జీవితంలో నిరాడంబరత, నిర్మాలిన్యత, నిష్కాపట్యం అందరూ అంగీకరించదగిన సుగుణాలు" అని గాంధిజీ అన్నారు

"నవభారత జాతీయతకు పునాదులువేసి, పళ్ళ తరబడిని రాయి వెంటరాయి పేర్చి, స్వాతంత్ర్య సౌధాన్ని కూర్చిన మానవోత్తముడు మాలవ్యాజీ ఆయన మరణంతో ఇండియా రాజకీయాలలో ఒక యుగం అంతరించిందని అనుకుంటాను నా బాల్యం అంతా, రాజకీయాలకి సంబంధించినంత మటుకు, ఆయనతోనే జ్ఞప్తికి వస్తూ ఉంటుంది నా బాల్య దృష్టికి మాలవీయాజీ ముఖంలోనూ, మూర్తిలోనూ ఇండియా రాజకీయాలు రూపొందాయా అన్నట్టు కనపడుతుంది

బాల్యంనుంచి అనేక రంగాలలో ఆయన కావించిన ప్రజాసేవ, బనారస్ హిందూవిశ్వవిద్యాలయం లాంటి సంస్థను నెలకొల్పగలిగిన శక్తి, నిష్కల్మషహృదయం, కార్యదీక్ష, మనస్సులను హరించే ఉపన్యాస ధోరణి, శాంత స్వభావం, ఆకర్షణ శక్తి గల వ్యక్తిత్వం, భారత ప్రజానీకానికి ప్రేమపాత్రునిగా చేశాయి ఆయన వయస్సూ, ఆయన నిరంతరమైన ప్రజాసేవా, భారత రాజకీయాలలో గ్రీకుదేశపు నెస్టారుగా పరిగణింపచేశాయి బాల్యమునుంచి మన జీవితాలను ఉత్తేజపరచి మాతృదేశారాధనను బోధించి వెలుగునిచ్చే నక్షత్రాన్ని ఇక చూడబోము యుగయుగాల నుంచి భారతదేశంలో ఉద్భవించిన మహనీయులకోవలో వానిగా ఆయనను తెలుసుకునే భాగ్యం మనకు లభించింది" అని జవహర్‌లాల్ నెహ్రూ అన్నారు

"పంజాబు దుస్థితిలో ఉన్నప్పుడు, అస్సాము కష్టాలలో ఉన్నప్పుడు, కాంగ్రెసు బహిష్కరింపబడి ఉన్నప్పుడు, బాధితులను రక్షించడానికి, దాస్యశృంఖలాలను ఛేదించడానికి, జాతీయ స్వేచ్ఛను సంపాదించడానికి ఒంటరిగా నిలబడి పోరాడిన మహోవ్యక్తి మాలవ్యాజీ. మూర్తీభవించిన భారత సంస్కృతి ఆయన భారత జాతీయత పుష్పించిన దివ్యకుసుమం ఆయన" అని కె ఎమ్ మున్షీ అన్నారు

క్రీస్తు పండగరోజున యావత్ప్రపంచం ఆనందంలో ఓలలాడే రోజున, మానవులలో శాంతి సుహృద్భావములు నెలకొనేందుకు దేవతలు కీర్తనలు పాడేవేళ, దేవాలయములలో గంటలు మ్రోగుతూఉంటే, సంధ్యా సమయంలో, 1861 వ సంవత్సరం డిసెంబరు 25 తేదిని శుభముహూ

ర్తాన ప్రయాగ పుణ్యక్షేత్రంలో, మాలవ్యా కుటుంబంలో, శ్రీకృష్ణ భక్తుల ఇంట మాలవ్యాజీ, మదన మోహనుడై ఉద్భవించారు ప్రయాగ త్రివేణీ సంగమ స్థానంలో ఏడేండ్ల ప్రాయం గల మాలవీయాజీ ఉపన్యాసాన్ని వేలాది ప్రజలు విని హర్షించే వారు హిందీ భాషలో ప్రవాహం లాగా మాట్లాడే వారాయన శ్రీమద్భాగవతంలోంచి సంస్కృత శ్లోకాలు ఉదహరిస్తూ మాట్లాడుతూంటే జనం విరగబడి ఎవరబ్బా ఈ అబ్బాయి అని ఆశ్చర్యపడేవారు

ధర్మ జ్ఞానోపదేశ పాఠశాలలో ఆయన విద్యకు ప్రారంభం 15 ఏండ్ల వయసులో ఆయనకు వివాహం జరిగింది మతమూ, విద్య, ఈ రెండే ఆయన ఉపన్యాస విషయాలు సంస్కృతములోనూ, హిందీలోనూ ఉద్రేకపూరితంగా మాట్లాడే టప్పుడు ఆయన ఉపన్యాసం వివశయై వింటున్న తన భార్యను చూచినప్పటి ఆయన ఆనందం చెప్పదగినది

1880వ సంవత్సరంలో అలహాబాదులోని మూాయిర్ కాలేజీలో చదువుతున్నప్పుడు మోతీలాల్ నెహ్రూ ఆయనకు మిత్రుడు ఇద్దరూ ఇంగ్లీషు భాషలో నిధులు కాలేజీ నాటకసమాజంలో షేక్స్పియరు మర్చెంట్ ఆఫ్ వెనిస్ నాటకంలో మాలవ్యాజీ పోర్షియాపాత్రను నిర్వహించినప్పుడు ఆయన మధుర కంఠ స్వరమూ, వాదనయందలి నేర్పూ, నటనా చాతుర్యమూ కళాశాలాధ్యక్షుడు ఆగస్టస్ హారిసన్‌కు గర్వకారణా లయాయి

తరవాత యోగాభ్యాసం చేసేవారు త్రివేణీ సంగమ స్థానంలో గాయత్రీ మంత్రం పదిలక్షలసార్లు జపించేవారు ప్రిన్సిపాలు హారిజన్ ఇచ్చిన విద్యావేతనం అయిదు రూపాయలలో, మూడురూపాయలు తల్లికి ఇచ్చేవారు

అఖిలభారత జాతీయ కాంగ్రెసు సంస్థాపకుడు హ్యూమ్‌తో పరిచయం కలిగిం దాయనకు తరువాత కాంగ్రెసుకు కార్యదర్శి అయారు తల్లి ఆదేశానుసారం ఉపాధ్యాయవృత్తి స్వీకరించారు

1886 లో కలకత్తాలో కాంగ్రెసుకు దాదాభాయి నౌరోజీ అధ్యక్షుడుగా ఉన్న సభలో "నేను మాట్లాడవచ్చునా" అని అడిగి యువకుడైన మాలవ్యాజీ చేసిన ఉపన్యాసం ప్రేక్షకులను చకితులను చేసింది ఆయనకు అఖండమైన కీర్తి గడించింది

"హిందూస్థాన్" పత్రికకు సంపాదకులుగా ఉండి "ప్రయాగసమాచార్" అనే ఇంకొక పత్రిక నడుపుతూ, హిందీ వార్తాపత్రికా నిర్వహణలో పితా

మహానుడై, ప్రజాసేవయందు మునిగి, హిందూసమాజ్, సనాతన సభలకు ప్రారంభకులైనారు. 1891 వ సంవత్సరంలో న్యాయశాస్త్రంలో పట్టభద్రుడై అలహాబాదు హైకోర్టులో న్యాయవాదిగా ప్రవేశించి, సర్ తేజ్ బహదూర్ సప్రూవంటి మేధావుల మన్ననలను పొందారు. ఆరోజులలో నెలకు ఎనిమిదివేల రూపాయలు ఆర్జించి అగ్రగణ్యులైన న్యాయవాదులలో ఒకరైనా చేతిలో దమ్మిడీ మిగిలేదికాదు. అలహాబాదు మునిసిపాలిటీకి వైస్‌చెయిర్‌మన్‌గా ఉండి, పట్టణాభివృద్ధికీ, ప్రజారోగ్యానికీ పాటుపడ్డారు.

1902 వ సంవత్సరములో సంయుక్త పరగణాల లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో సభ్యుడై అనేక సంఘాలలో సభ్యత్వం పొంది, సాంకేతిక విద్యకు, స్త్రీ విద్యకు, కృషిచేశారు. నాగరి ప్రచారణ సంస్థను నెలకొల్పి "ఇండియన్ యూనియన్" "అభ్యుదయ" "ఇండియన్ పీపుల్" "లీడర్" "హిందూస్థాన్ టైమ్సు" మొదలైన పత్రికలకు స్థాపకులైనారు.

1905 లో ఆయన కాంచిన కలలే రూపుదాల్చి బనారస్ హిందు విశ్వవిద్యాలయంగా మారాయి. లాహోరులో జరిగిన 24 వ కాంగ్రెసు సభలో ప్రెసిడెంటుగా మకుటం ధరించారు. "నిజాయితీగా ఉండు — వినయంగా ఉండు" ఇదే ఆయన సందేశం. 1911 లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు సభ్యుడుగా ఎన్నికై గోఖలేగారితో కలిసి పనిచేసే అవకాశం చిక్కింది. తరువాత న్యాయవాదిత్వం విరమించారు. బనారస్ విశ్వవిద్యాలయం కోసం విరాళాలు స్వీకరించి 1916 లో శంఖుస్థాపన చేశారు. కోటి రూపాయలు అచిరకాలంలో వసూలు చేశారు. అమూల్యమైన బనారస్ విశ్వవిద్యాలయమే మాలవ్యాజీ నుండి భారతదేశానికి సంక్రమించిన వారసత్వ ధనం.

1919 వ సంవత్సరంలో పంజాబులో జరిగిన జలియన్‌వాలాబాగ్ దురంతాల సందర్భంలో అప్పటి వైస్‌రాయ్ చెమ్సుఫర్డును ఎదిరించి సభలో 93 ప్రశ్నలు వేసి ప్రజల మన్ననలు పొందారు. అప్పుడే మహాత్మాగాంధీ మాలవ్యాజీని ధర్మాత్ముడన్నారు.

1924 లో ప్రయాగలోని కుంభమేళాను ప్రభుత్వం నిషేధించినప్పుడు గంగఒడ్డున ఎండలో కూర్చుని సత్యాగ్రహం చేసి, లాటీలూ, గుర్రాలూ, తుపాకీల మధ్యగా పోయి గంగలో స్నానం చేసి ప్రభుత్వం మీద విజయం సాధించిన ధీరమూర్తి మాలవ్యాజీ.

1929 లో కలకత్తా హుగ్లీ నదిలో ఎందరో హరిజనులను స్వహస్తాలతో కడిగి అస్పృశ్యతా నివారణకు, హరిజనోద్ధరణకు ప్రాతిపదికలు వేశారు

1930 లో బొంబాయి నగరంలో కింగ్స్‌వే రోడ్డుమీద ఎవరూ నడవకూడదని ప్రభుత్వం నిషేధించినప్పుడు "మా గడ్డపై మేము నడవకూడదని ఎవరు అనగలరు" అని ప్రభుత్వాజ్ఞను ఉల్లంఘించి సర్దార్ పటేల్‌తో శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించారు ఆ యేడు భారతదేశంలోని వేలాది నాయకులందరూ కారాగారంలో బంధింపబడ్డారు మాలవ్యాజీ, జవహర్‌లాల్ నెహ్రూ, నైనీ జైలులో సహచరులుగా ఉండేవారు 1931 వ సంవత్సరంలో బ్రిటిష్ పార్లమెంటులో ఆయన స్వరాజ్య సంపాదనకై చేసిన ఉపన్యాసంపై లార్డు శాంకీ "మన భాషలో మాలవ్యాజీ ఎంత చక్కగా మాట్లాడారు! ఇంగ్లీషు భాషపై ఆయనకు ఎంత అధికారం ఉందో!" అన్నారు

1942 వ సంవత్సరంలో బనారస్ విశ్వవిద్యాలయావరణలో ఇద్దరు ఋషులను వేదికపై అధివసించి ఉండగా చూసిన లక్షలాది ప్రజలు ధన్యులు యూనివర్సిటీ రజతోత్సవమది "మహాత్మా గాంధీనీ, మహామాన్ మాలవ్యాజీని కన్న భరతమాత ధన్యాత్మురాలు ఈనాడు ఇద్దరినీ ఇక్కడ దర్శించడం మన అదృష్టం" అని అప్పుడు రాధాకృష్ణ పండితుడు అన్నారు

1946 వ సంవత్సరానికి మాలవ్యాజీ ఎనభై పళ్ళ వృద్ధుడై అంత్యదశలో ఉన్నారు నెహ్రూజీ భారత ప్రభుత్వానికి సారథ్యం వహిస్తున్నా రన్న వార్త విన్న మాలవ్యాజీ "అబ్ నె దేశ్ మే అప్‌నా రాజ్" అనే మాటలు ఉచ్చరించారు ★

మాలవ్యాజీ శతవార్షిక జయంతి యావద్భారత దేశంలోనూ జరుగుతూంది ఈ మహా వీరుని స్మరించడం మన విధి

---

## సినిమా క్విజ్ - జవాబులు

1 పెద్దమనుష్యులు

2 వందేమాతరం

3. గుణ్ణో పెళ్లి

4. చెవిలో రహస్యం

# వేమన పద్యాలు





కలికచేరుగారు కంగారు పెట్టితే
పిలక జుట్టొసంగె పేరిశాస్త్రి
యుద్ధ నిధికి పంపె ఉద్యోగి వెంటనే
విశ్వదాభిరామ వినుర వేమ '

పద్యం : కృష్ణశాస్త్రి చిత్రం : బుజ్జాయి



“ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా?!...”




రాత్రి పడిన జల్లుతో నేలంతా తడీ పొడీగా వున్నది గురప్ప గుడిశె ముందు ఓ చింకిపట్టా పరుచుక్కూచుని, సాగనార తడపల్తో ఉచ్చులు అల్లుతున్నాడు ఎదురుగ్గా రోడ్డవతల కూతవేటు దూరంలో గ్రామం పక్కన వున్న దొరవారి తాటితోపులోంచి సూర్యుడు తాపీగా ఆకాశం మీదికి ఎగబాకుతున్నాడు

గుడిశెలో చిన్నచప్పుడైంది నార పోచను చూపుడువేలి మించి తిప్పి ముడివెయ్యబోతున్న గురప్ప చప్పున దాన్ని బొటనవేలితో వెనక్కునెట్టి తల తిప్పి వెనక్కు చూశాడు గంగి గుడిశెవాకిలి దగ్గిర నిలబడి నిద్రమత్తు కళ్లతో బయటికి చూస్తున్నది ఆ చూపు తనకేసో, లేక రోడ్డుకేసో గురప్పకు అర్థంకాలేదు. "ఊహూఁ, ఈ పిట్ట నిలవదు. దీన్ని ఎగిరిపోకుండా పట్టుంచే ఉచ్చులు అల్లటం నా వల్ల కాదు," అనుకుంటూ గురప్ప తల వాల్చేసుకుని విసుగ్గా నార తడపను కాలి మడంకింద తొక్కిపట్టి, వేళ్లతో నిలువునా చీల్చసాగాడు.

"ఇప్పుడు కొంగలూ, కొక్కిరాయిలూ పట్టతానికి ఎళతావన్నమాట! శూద్రోడివై పుట్టి యానాది పనులు చెయ్యటం నీవల్ల ఎట్టవుద్ది ?" అంటూ గంగి పక్కగా వున్న మేదర తడికెను లాగి కిర్రు మనిపిస్తూ వాకిలి మూసింది.

"ఎహెయ్, నీ కొక్కిరాయి మాటలు కట్టిపెట్టేయ్,గంగీ!" అంటూ

గురప్ప చేతులో వున్న నార తడపను దూరంగా విసిరి కొట్టాడు.

గంగినుంచి ఏ జవాబూ లేదు. గురప్ప పట్టరాని కోపంతో పెదాలు గట్టిగా బిగించి, లేచి నిలబడుతూనే కిందున్న చింకిపట్టాను వాకిలికి అడ్డంగా వున్న తడికె కేసి తన్ని, పెద్ద పెద్ద అంగ లేస్తూ పోయీ రోడ్డు పక్కన వున్న వేపచెట్టు మొదట్లో చతికిలబడి కూచున్నాడు.

గురప్ప మనస్సు చీకాకై పోయింది. ఈ మధ్య నెల రోజులుగా గంగి తనను అనరాని మాటలు అనేస్తున్నది. దాని నోరు మూయించటం ఏమంత కష్టం కాదు. సాచి చేత్తో చెంపమీద ఒకటీ, కాలితో నడ్డిమీద రెండూ తంతే— మరి వారం రోజుల వరకూ కుక్కిన పేనులా వుండిపోతుంది. కాని, యిప్పుడు దాన్ని తన్నేందుకు లేదు. దానికి ఏడో నెల కడుపు.

"ఛీ ఛీ, దాన్ని బస్తీలో ఆ ఎంగిలి యానాదోడి దగ్గిరే బతక నియ్యా ల్సింది," అనుకున్నాడు గురప్ప. వెంటనే అతడికి బస్తీనుంచి గంగిని ఈ పల్లెటూరు లేపుకు రావటానికి తానుపడ్డ అవస్థలూ— తెగించి ఒంటరిగా దాని మొగుణ్ణీ, వాడికి జత వచ్చిన మరో యిద్దరు రౌడీలనూ ఎదిరించి పోట్లాడిన సంగతులూ గుర్తుకొచ్చినై. అతడు అప్రయత్నంగా మీసం దువ్వు కున్నాడు.

"నన్ను చూసి ఎవడైనా నలభై య్యేళ్లవా డనుకుంటాడా? కాయ పాటు శరీరం, దండీలూ, బస్కీలూ కొట్టిన ఒళ్లు— నన్ను మొట్టమొదటగా చూసినప్పుడు ....అది...గంగి— ముప్పై యేళ్ల వాడి ననుకున్నదంట! అహ్హా...." అనుకుంటూ గురప్ప సంతోషంగా ఒళ్లు విరుచుకుని, వేప చెట్టు మొదలుకు చేరగిలబడ్డాడు.

సూర్యుడు దొరవారి తాటితోపు లోని చెట్ల తలల మీంచి తొంగిచూస్తు న్నాడు ఆ కాంతిలో గురప్పకు రెండు తలల తాటిచెట్టు స్పష్టంగా కనిపిం చింది. అతడి మనస్సులో రకరకాల ఆలోచనలు కదలబారినై. ఉండీ, తాను దరిద్రం అనుభవిస్తున్నాడు. దొంగ సొత్తును పరులు అనుమానించ కుండా ఖర్చు పెట్టటం చాలా కష్టం. తనకు హఠాత్తుగా ఏ లంకెలబిందో దొరికిందంటే ఎవరూ నమ్మరు; నమ్మినా అది పోలీసువాళ్ల పరం అవుతుంది. దొంగతనాలు చేసినందుగ్గాను రెండు సార్లు జైలుకుపోయి వచ్చిన వాడిదగ్గిర డబ్బు మెదులుతూండటం చూస్తే, వెంటనే అది దొంగసొత్తని అందరూ పసిగట్టేస్తారు.

ఇలాంటి, దారీ డొంకా తెలీని ఆలోచనలతో గురప్పకు శరీరం నీరస

పడిపోయినట్టనిపించింది. "కొన్నాళ్ల పాటు కూలీ నాలీచేసి గంగిని బతికించా ల్సిందే. దానికి ఎన్నాళ్లు పెట్టాను! చీరలూ....సొమ్ములూ....అవేవీ కొని పెట్టకుండా దాన్ని ఇక్కడ వుంచటం కష్టం. ఏదో రోజున నేను యింట్లో లేకుండా వుండటం చూసి, అది బస్తీకి వుడాయించేస్తుంది. ఊహుఁ, దాన్ని ఎట్టా పోనిస్తానూ? ముందు నా బిడ్డని యిక్కడ కని పడేసి, తరవాత యిష్టం వచ్చినచోటికి పారిపొమ్మను. ఓటల్లో ఎంగిలి కప్పులు కడుక్కునే ... ఆ మొగుడి దగ్గిరికి పోయినా నాకేం పట్టదు."

మగత నిద్దర్లోంచి ఉలిక్కిపడి లేచినట్టుగా, బిత్తరపోతూ గురప్ప గుడిశె కేసి చూశాడు. గుడిశెలోంచి పెద్దగా దగ్గూ, ఆ వెంటనే 'ఓక్' అంటూ డోక్కోవటం అతడికి వినిపించింది.

గురప్ప గుండెలు వేగంగా కొట్టుకున్నై. కాళ్లూ చేతులూ స్వాధీనం తప్పినట్టయింది. "ఏదో అఘాయిత్యం చేసింది," అనుకుంటూ అతడు ఎక్కడలేని సత్తువతో ఎగిరి నిలబడి, రివ్వుమంటూ గుడిశెలోకి పరిగెత్తి, వాకిలికి అడ్డంగావున్న తడికెను చర్రున పక్కకు లాగాడు.

గంగి గోడనానుక్కూచుని పెద్దగా డోక్కుంటున్నది. గురప్ప ఒక్క అంగలో దాని దగ్గిరకు వెళ్లి, రెండు



"తెలివి తక్కువ వెధవలు అడిగే ప్రశ్నలకు బ్రహ్మకూడా సమాధానం చెప్పలేడు."
"ఆ! ఇప్పుడు తెలిసిందండి మాస్టారూ నేను పరిక్షల్లో ఎందుకు తప్పానో!"

చేతులతో దాని తల గట్టిగా పట్టుకుంటూ, "ఏం చేశావే గంగీ? ఏం చేశావ్?" అంటూ ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"ఛీ, నన్నంటుకోమాక. నన్నిట్టాగే సావనీ," అంటూ గంగి గురప్ప చేతుల్ని తన చేతుల్తో పక్కకు నెట్టింది. ఆ సమయంలో దాని గుప్పెంట్లోంచి, ఏదో కిందపడి దూరంగా దొర్లుకు పోయింది. గురప్ప ఆ దొర్లుకు పోతున్న దానికేసి ఓ తృటికాలం చూసి, నిర్విణ్ణుడై వెళ్లి దాన్ని చేతిలోకి తీసుకుని పరీక్షగా చూశాడు. అది గన్నేరుకాయ. ఒక పక్కన కాస్త

కోరికినట్టు వుంది. గురప్ప నిశ్చేష్టు డయాడు.

"నన్ను బతకానియ్యవూ, సావను కూడా సావనియ్యవు," అంటూ గంగి గొంతెత్తి శోకం ప్రారంభించింది.

గురప్పకు కాళ్లూ చేతులూ వణికినై. ఆ క్షణంలో అతడికి గంగిమీద ఎక్కడ లేని మమకారం పుట్టుకొచ్చింది. తాను మొట్ట మొదటిసారి బస్తీలో చూసిన గంగి అతడి కళ్ళముందు కదుల్లాడింది.

గంగి మాంచి ఒడ్డూ పొడుగూ, ఒంపూ సొంపూవున్న ఆడది. రంగు నల్లనైతేం గాక; పెద్దకళ్లూ, తీరైన ముక్కూ, నిండు తలకట్టూ...చక్కని మాటతీరూ దానిసొత్తు. గురప్ప జైలు నుంచి బయటికి వచ్చిన రోజున, దాన్ని హోటల్లో అంట్లు తోముతూండగా చూసి, యిట్టే ఆకర్షించబడ్డాడు.

తను యిక దొంగతనాలు చెయ్యనని మాట యిచ్చింతరవాతే, గంగి తనతో లేచి రావటానికి ఒప్పుకున్నది. బతికినంత కాలం సుఖంగా బతికేందుకు అవసరం అయిన డబ్బు తను జాగర్త పరిచానని కూడా దానికి చెప్పాడు. చీరెలూ, నగలే కాక, మంచి ఇల్లూ, పొలాలూ కూడా కొనుక్కోవచ్చని నమ్మబలికాడు. కాని, ఈ సంవత్సరంన్నరలో తాను యిందులో ఏ ఒక్క మాటా నిలుపుకోలేదు.

"గంగీ, నువ్వుపోయాక నేను బతికుంటా ననుకున్నావా? నేనూ చస్తాను. ఇద్దరం ఒకేసారి చద్దాం పట్టు," అంటూ గురప్ప గంగి పక్కన కూచుని, దాని భుజం మీద చేయి వేశాడు. గంగి అతడి చేతిని విసురుగా లాగి పారేస్తూ, పెద్దగా ఓక్ మని, "నువ్వు కులపోడివి, నేను యానాద్దాన్ని. నాకు ముక్కుకి పుడకావద్దు, మెళ్ళోకి కంటే వద్దు. నీ గుబులంతా నా మీదకాదు, నా కడుపులో వున్న పిల్లోడిమీద. అణ్ణి కనంగానే నన్నుతన్ని తరిమేస్తావ్. ఎప్పుడో ఎందుకు, అణ్ణి యిప్పుడే నీ ఒళ్లో ఏస్తాను. ఆ మూలున్న పీట పెట్టి, పొట్ట మీద రెండు పోట్లు పొడువ్," అంటూ బావురుమన్నది.

ఆ క్షణంలో గంగిని సముదాయించటం ఎట్లాగో తెలీక గురప్ప బెంబేలు పడిపోయాడు. నయం, గన్నేరుకాయ సొంతం తిన్నదికాదు; అంతవరకు అదృష్టవంతుణ్ణి అనుకున్నాడు.

"కులం పేరెత్తి నన్ను సూలం పోట్లు పొడవకే, గంగీ!" అంటూ గురప్ప కళ్ళ నీళ్ళ పర్యంతమై, దాని గడ్డం పట్టుకుని బతిమాలటం ప్రారంభించాడు: "నువ్వు ఎవరో శూద్రోళ్ళ పిల్లవనీ, పుట్టంగానే నిన్ను యానాది గుడిశెల ముందు వదిలిపోతే యానా

దోళ్ళు పెంచారనీ, లోగడే నాకు చెప్పావ్‌గందా. గంగీ అని పిలిసినందుకు, మొన్నామధ్య నేను చినకాపు కొడుకు యీపు పగలెయ్యాలా? ఆడు ఆ రోజు నుంచీ నిన్ను గంగమ్మానే పిలుస్తున్నాడు గదా! నువు చెప్పిన సంగతి అబద్ధం అనుకున్నాననుకున్నావా?''

"అబద్ధాలాడేది నువ్వు,'' అంటూ గంగి గట్టిగా కసిరి కొట్టింది.

''నే నాడిన అబద్ధం ఏంటి?'' అన్నాడు గురప్ప బతిమాలుతూ.

"అంత డబ్బు... యింత డబ్బు ఎక్కడో దాశానన్నావ్?''

"అవునే, దాశాను."

''దాశావా? ఎక్కడ? నిజంగా నే దాస్తే, నాకు ఒక్క ముక్కు పుడకైనా సేయించవేఁ?''

గురప్ప పెద్దగా నిట్టూరుస్తూ, "ఆ డబ్బు యిప్పుడే బయటికి తీయటం పెమాదమని ఎన్నిసార్లు సెప్పానే! దొంగతనాలు సేసినందుకు రొండుసార్లు జయిలు కెళ్ళి నోణ్ణిగందా. పోలీసోళ్లు లాటీలు పెట్టి డొక్కల్లో, గుండెల్లో ఎన్ని కూపి పోట్లు పొడిసినా, ఆ దాసిన చోటు బయట పెట్టకుండా వూరుకున్నాను. ఇప్పుడా డబ్బు తీసి వాడకం పెడితే, వాళ్ళకి దొరికి పోవటమే గందా? కాస్త ఓపిక



"ఇవాళ పెద్దవారితో చాల అమర్యాదగా ప్రవర్తించాను."
"అరె! ఏమయింది?"
"నెహ్రూగారు కారులో పోతూ అందరికీ నమస్కారము పెట్టుకుంటూ వస్తూ నాకూ పెట్టారు. కాని, నేను ప్రతి నమస్కారం చెయ్యలేదు. ఏం జెయ్యను రెండు చేతులలో రెండుండిపొయ్యె."

పట్టే. పిల్లాణికన్న మరసటి రోజున, ఆ దాసిన డబ్బూ, బంగారం నగలూ నీ కళ్ళకి సూపిస్తాను. అయన్నీ అమ్మి కర్చుపెట్టే యవారం మాత్రం—ఆ తరవాతే. ఆ బంగారమంతా కాత్త కాత్త నిదానంగా అమ్మి, ఒక్కొక్కటీ... పొలం, పుట్రా కొనుక్కుందాం,'' అన్నాడు.

"ఆ డబ్బూ, నగలూ ఏయోనా కళ్ళపడితే కాని నే నమ్మను,'' అన్నది.

గంగి, మళ్లీ డోక్కోపోయేదానిలా ముఖంపెట్టి

గురప్ప చప్పున చేతుల్తో దాని తల పట్టుకుంటూ, కక్కోవే, కక్కో ఇంకా లోపల ఆ గన్నేరు పప్పేమన్నా మిగిలుంటే బయటికి పోద్ది," అని కాసేపాగి, "ఆ డబ్బూ అదీ నీకు సూపిద్దామని మొన్నామధ్య ఆ దాసిన చోటుకి వెళితే, ఆ చుట్టు పక్కల మనుషులు తిరుగుతున్నారు ఏమయితే అదవుద్దిలెమ్మని మూర్ఛించి మరి కాస్త ముందుకు పోయి చూస్తును గందా—ఆ పక్కనే చిన్న పుట్ట ఎలిసింది దానిమీద రెండు తాసు పాములు పెనేసుకు పడున్నై టూరుకు తిరిగొచ్చాను," అన్నాడు

"బలే కతలు సెపుతావే గురప్పా లే లే, నన్నంటమాక ! దొంగ బుద్దెక్కడికి పోద్ది" అంటూ విదిలించుకుని లేచి నిలబడింది గంగి

గురప్ప ఓ క్షణకాలం స్తభించి పోయాడు అతడి ముఖం వెలవెల పోయింది కాసేపటికి తేరుకున్న వాడిలా చిరునవ్వు నవ్వుతూ, "నువ్వానే సూటిపోటి మాటలకీ, కారు కూతలకీ, మరెప్పుడన్నా అయితే, గొంతు పిసికి మరీ సంపేవాణ్ణి అదుగో, ఆ డున్నాడు ఆడిముఖం చూసి నిన్ను వదిలేసున్నాను వాణ్ణి భూమ్మీద పడనీ, నీ పొట్లు సూద్దువుగాని," అంటూ గుడిశెలోంచి గబగబా బయిటికి వెళ్ళిపోయాడు

"ఓ గురప్పో, ఎక్కడికి ?" అంటూ ఓక్ మన్నది గంగి

"నేనబద్దాలకోర్నో, నమ్మకస్తుణ్ణో తేలుస్తాను ఆ డబ్బూ, నగలూ తెచ్చి యిప్పుడే నీ మొఖం ఎదట పెడతాను," అంటూ గురప్ప ఉరుము తున్నట్టుగా అరిచాడు

* * *

రెండు గంటల తరవాత గురప్ప తల వేలాడేసుకుని, పిల్లిలా అడుగులో అడుగేసుకుంటూ, రోడ్డుదాటి గుడిశె ముందుకు వచ్చేసరికి, వాకిటికి ఒక పక్కగా వాసెన కట్టివున్న ఒక చిన్న కుండ కనిపించింది ఏమిటా యిదని అతడు ఆశ్చర్యపోయేంతలో, గుడిశె లోపలి నుంచి పెద్దగా నవ్వూ, ఆ వెంటనే—చింతపూలా రైకదానా అన్న పాటా వినిపించింది ఆ పాట వినబడగానే గురప్ప ముఖం జేవురించింది కోపంతో ముక్కు పుటాలు అదిరినై అతడు పళ్లు పటపట కొరుకుతూ, "ఎవఁడ్రా వాడూ, రా బయిటికి !" అంటూ వాకిలికి అడ్డంగా వున్న తడికెను ఒక్క తన్ను తన్నాడు

"ఏరోయ్, గురప్పా ! పొరుగూరోణ్ణి, సాటి కులపోణ్ణి పటుకుని నోటి




కొచ్చిన మాట అనెయ్యటమే! ఈ డెవడనుకున్నావ్, సమ్మిట సత్తెయ్యా రోయ్, సమ్మిట సత్తెయ్యా!'' అంటూ ఒక ఆజానుబాహుడు, రొమ్ము విరుచు కుంటూ గుడిశెలోంచి బయటికి వచ్చి, గురప్పకు ఎదురుగా నిలబడ్డాడు

గురప్పకు వళ్లు మండిపోయింది సూట్టానికి సత్తెయ్యా తన మీద ఓ గుప్పెడుంటాడు తనకన్న మరి కాస్త కండలు తేరిన శరీరంకూడా అయినా, చేయీ చేయీ కలపటం వరకూ వస్తే, తను వాణ్ణి ఒక్క కూపీపట్టు పట్టి, మోచేయో మోకాలో విరగ్గొట్ట గలడు కానీ, దానికి యిది సమయం కాదు సత్తెయ్యా డబ్బు కలవాడు కాకపోయినా, పలుకుబడి కలవాడు ఆ చుట్టుపక్కల అతడికి పాము మంత్రగాడుగా పెద్ద పేరుంది

''ఎంత కులపోడివైతే మాత్రం మొగాడు లేనప్పుడు, ఇంట్లో జొర బడతావంట్రా? పైన ఆ ఉల్లాయి పదాలేంటి? నువ్వు సమ్మిట సత్తెయ్యా వయితే, నేను గాలం గురప్పని, తెలుసా?'' అన్నాడు గురప్ప పౌరుషం కనబరుస్తూ.

సత్తెయ్యా గతుక్కు మన్నాడు తను అనవసరంగా దురుసు మాట లనటం పొరబాటని గ్రహించాడు. గురప్ప పేరు మోసిన దొంగ పైగా, కులం చెడినోడు తను వాణ్ణి కొట్టినా, లేక వాడే తన్ను కొట్టినా—తన గౌర వమే పోతుంది

"అంత కోపం తెచ్చుకోకురా, గురప్పా! నేనేం పని గట్టుకుని నీ యింటికి రాలేదు క్రిష్ణమాచార్లు ఎవరికో ప్రాణం మీద కొచ్చిందని

పచ్చి గరళం కావాలంటే, చెట్టూ పుట్టా తిరిగి, పామును పట్టుకుని కుండలో పెట్టి తీసుకు పోతున్నాను. కాస్త దాహమై, రోడ్డు పక్క యిల్లు గనక లోపలి కెళ్లాను. అంతే,'' అన్నాడు సత్తెయ్యా రాజీ ధోరణిగా.

"అంత గొంతెండే దాహం అయితే బయటుండే అడగొచ్చుగా, యింటో కెందుకెళ్లావ్ ? ఆ ఉల్లాయ్ పదా లేంటి ? కనపడదే, ఆలంకెక్కడ సచ్చింది ! ఏయ్, గంగీ'' అంటూ గురప్ప లోపలికి వెళ్ల బోయిన వాడల్లా ఆగి, ఏదో పూనకం వచ్చిన వాడిలా చప్పున వెనక్కు తిరిగి, "ఒరే సత్తెయ్యా, ఇదే ఆకరు మాట సెప్తున్నాను. ఎప్పుడైనా నే నింట్లో లేనప్పుడు యీ దరిదాపుల కనిపించావో, నీ నెత్తురు తాగుతాను. ఫో, యిక్కణించి ఫో ! ఈ దెవసం కుండ తీసెయ్,'' అంటూ కీచు గొంతుతో పెద్దగా అరిచి, కుండను కాలుతో ఒక్క తొక్కు తొక్కాడు. కుండ ఠపీమని శబ్దం చేస్తూ పగిలిపోయింది. లోపల ఉన్న నల్ల తాచు బుస్సు మంటూ పైకి లేచి, గురప్ప శీల మండను గట్టిగా పట్టుకుని కాటు వేసింది.

గురప్ప కెవ్వుమన్నాడు సత్తెయ్యా కొయ్యా బారిపోయాడు. 'అమ్మో' అని అరుస్తూ గంగి లోపలి నుంచి పరిగెత్తుకు వచ్చింది. గురప్ప తూలుతూ తూలుతూ గడప కేసి రెండడుగులు వేసి, వికృతంగా అరిచి దభీమని కింద పడిపోయాడు. పగిలి పోయిన కుండ పెంకుల చాటున మెలికలు తిరుగుతున్న తాచు పాము బుస్ మంటూ పడగ విప్పి లేచి, కింద పడివున్న గురప్ప మీంచి చర్రున జారి, బాణంలా రోడ్డు కేసి పరిగెత్తింది.

"మూర్ఖం తొత్తుకొడకా ! నా కొచ్చే పది యాపాయలూ నీ ఎదాన పెట్టుకున్నావ్ గదరా,'' అంటూ సత్తెయ్యా గురప్ప కేసి ఉరిమి చూసి, "ఏయ్, ఆగు, ఆగు !'' అని ఆజ్ఞాపిస్తున్నట్టు కేకలు వేస్తూ, తాచు పాము వెంట పడ్డాడు.

గంగి, "అయ్యో, నా దేముడో,'' అని తల బాదుకుంటూ గురప్ప మీద వాలిపోయింది.

గురప్పకు నరాలన్నీ పీకుతున్నట్టూ, గుండెలు గరిశె పడుతున్నట్టూ బాధ కలిగింది. "విషం తల కెక్కుతున్నది, బతకను,'' అనుకున్నా డతడు. ఆ నిమిషంలో అతడికి తాను చచ్చిపోతున్నాననే భీతికంటే, గంగీ, దాని గర్భస్థ శిశువూ గురించిన భయం ఎక్కువైంది.

గురప్ప లేచి కూచునేందుకు ప్రయత్నించాడు. కాని, సాధ్యంకాలేదు.

గొంతులో ఏదో గురగుర ప్రారంభమై నాలుకంతా చేదు చేదై పోయింది. వున్నట్టుండి యింత నురుగు భళుక్కు మంటూ కక్కాడు.

"గంగీ, యిక నేను బతకను. దాచిన డబ్బు తెద్దామని ఎళితే, తోపులో తాటాకులు కొడుతూ నలుగురు మనుషులు కనిపించారు. పెద కాపు కూడా అక్కడే వున్నాడు. అందుకని వట్టి చేతుల్తో తిరిగొచ్చాను. ఆ డబ్బు ఎక్కడ దాచానో చెపుతా, జాగర్తగా యిను. దొరవారి తాడి తోపులో రొండు తల్ల తాడుంది చూశావ్, దాని పక్కనున్న కుంకుడు చెట్టు పాదులో దాన్ని పాతేశాను. దాని మీద గుర్తుగా చిన్న జిల్లేడు మొక్క కూడా నాటాను......తెల్ల జిల్లేడు మొక్క...." అని చెపుతూ గురప్ప పెద్దగా మూలిగి, నేల మీద మొలికలు తిరగసాగాడు.

గంగి మరింత పెద్దగా శోకాలు పెట్టటం ప్రారంభించింది. గురప్పకు తన కళ్లకేదో చీకటి పొర అడ్డం పడినట్టు భ్రమ కలిగింది. అతడు రెండు చేతులూ సాచి, గంగిని దగ్గిరగా లాక్కుంటూ, "గంగీ, బస్తీకెళ్లి నీ మొగుణ్ణి యిక్కడికి తెచ్చుకో. ఇద్దరూ కలిసి ఆ డబ్బు చాటుగా తెచ్చుకోండి. చూశావ్....నా కుర్రాణ్ణి.... ఎంగిలాకు ఎత్తే వాణ్ణిగా చేయమాక.... చూశావ్....చూశావ్...." అంటూ పెద్దగా మూలిగి, గోళ్లతో నేలను ఓసారి గట్టిగా బరికి, 'అబ్బా' అంటూ కళ్ళు మూసుకున్నాడు.

గంగి గుండెలు బాదుకుంటూ గురప్ప మీదికి వాలిపోయింది. "నా మొగుణ్ణి మంత్రం ఏసి బతికించద్రో బాబూ! నా దేముడు సచ్చిపోతున్నాడో, దేముడో! ఓ సత్తెయ్యా బాబో....తొరగా వొచ్చి మంత్రం ఏసి రచ్చించవయ్యో," అంటూ గురప్ప దగ్గర్నుంచిలేచి, రోడ్డు దాటి, సత్తెయ్య కోసం తాటితోపు కేసి పరిగెత్త సాగింది. ★







# రేఖ-శశిరేఖ

బి. విశ్వం



కల్యాణ మంటపంలో ముచ్చటగా కూర్చుని ఉన్నారు గోపాలం-శశిరేఖలు బయట బాజాబజంత్రీలు వారి ఆనందానికి శృతి కలిపి పాడుతున్నాయి పురోహితుడు మంత్ర పఠనం సాగిస్తున్నాడు ఆ సంస్కృత మంత్రాల అర్థం తెలియక పోయినా పురోహితుని సంజ్ఞల ప్రకారం అక్షతలు జల్లి తాళికట్టి కూర్చున్నాడు గోపాలం శశిరేఖ యిప్పుడు గోపాలం భార్య ఆ పందిట్లోనే గోపాలం శశిరేఖను చూచి చిరునవ్వు నవ్వాడు ఆ చిరునవ్వు అర్థం వేరు

అదే చిరునవ్వు నాలుగు సంవత్సరాలకు ముందు గోపాలం మొట్టమొదటి సారిగా శశిరేఖను కాలేజీలో చూచి నప్పుడు నవ్వాడు అప్పుడు శశిరేఖ సిగ్గుతో తలవంచుకుంది _గోపాలం

చిరునవ్వుకి అది సమాధానం వారి మనస్సుల కలయికకది మొదటి మెట్టు

సంవత్సరం లోగానే శశిరేఖా గోపాలం గాఢ ప్రేమికులయారు శశిరేఖ యింటికి తరుచూ రాకపోకలు సాగిస్తున్నాడు గోపాలం గోపాలానికి శశిరేఖ తలిదండ్రులతో, శశిరేఖ చెల్లెలు రేఖతో కూడా పరిచయం కలిగింది

రేఖ శశిరేఖకంటె రెండు సంవత్సరాలు చిన్నది ఇద్దరూ రూపంలో గుణంలో, కవలలు అందుకే తలిదండ్రులు పేర్లు కూడా రేఖ, శశిరేఖ అని పెట్టారు రేఖ శశిరేఖ కంటే చురుకయిన పిల్ల శశిరేఖకు సిగ్గు భయం రేఖకు చొరవ, ధైర్యం ఎక్కువ.

శశిరేఖా, గోపాలం ప్రేమికులయినా ఆ విషయాన్ని బయట పెట్టడానికి జంకారు మిత్రులలాగ మెలిగారు వారితో పాటు రేఖ కూడా ఎప్పుడూ ఉండేది

గోపాలం, శశిరేఖలు బి ఏ డిగ్రీ ముగించారు రేఖ అప్పుడే బి ఏ లో ప్రవేశించింది గోపాలం తన సొంత ఊరయిన కాకినాడకు బయలుదేరాడు ఉద్యోగార్థం శశిరేఖకు దుఃఖం ముంచుకొచ్చింది. కాని గోపాలం తనతో ఏకాంతంగా "మా నాన్నతో చెప్పి మన వివాహం ఏర్పాటు చేస్తాను నిన్ను విడిచి నేను మాత్రం ఉండగలనా" అన్నమాటలు ప్రతిధ్వనించి ధైర్యాన్నిస్తున్నాయి

గోపాలం కాకినాడలో తన మనస్సులోని కోరికను తలితండ్రులతో చెప్పాడు ఏరి కోరి చక్కని చుక్కను తెచ్చుకుంటామంటే వద్దంటామా అన్నారు తలిదండ్రులు

గోపాలం ఈ శుభవార్తను వెంటనే శశిరేఖకు తెలియ జేయాలని నిశ్చయించాడు ఈ వార్తను రేఖకు కూడా వ్రాయాలనుకున్నాడు ఇద్దరికీ జాబులు వ్రాశాడు కవరులలో పెట్టి పోస్టు చేశాడు

శశిరేఖ. రేఖ, యిద్దరూ గోపాలం వద్దనుండి జాబులు రావడం చూచి మురిసిపోయారు జాబులు తెరిచి చదివారు శశిరేఖ కంట గిర్రుమని నీరు తిరిగింది కళ్లు చీకట్లు క్రమ్మాయి, లోకం అంతా చీకటయింది ఏడుస్తూ మంచం మీద వ్రాలింది

ప్రక్క గదిలోనుండి రేఖ ఆనందంతో నవ్వుకుంటూ, కులుకుతూ తన జాబును తెచ్చింది రేఖకు చూపడానికి. రేఖ రావడం చూచి లేనినవ్వు తెచ్చుకొని "నువ్వు అదృష్టవంతురాలివి చెల్లీ" అంది శశిరేఖ.

"నీ కెలా తెలుసక్కా ?" అని అడిగింది రేఖ. శశిరేఖ తన చేతిలోని జాబును రేఖకు అందించింది. రేఖ జాబు చదువ సాగింది

"మిత్రురాలికి,

మీ యోగక్షేమాలను గూర్చి తెలియ లేదు. ఈ జాబు మూలంగా నీ కొక శుభ వార్తను తెలియజేయా లనుకుం టున్నాను. మీ సోదరితో నాకు పరిచయ మయిన నాటినుండి మా మనుసులు కలిశాయి. వివాహం చేసుకోవాలని నిశ్చ యించాము. ఆ నిశ్చయాన్ని మా తలి తండ్రులకు తెలియజేశాను. వారు అంగీక రించారు. ఇంక మీ తలితండ్రుల అంగీ కారం కూడా లభిస్తే మీ అందరకీ ఇంకా ఆప్తుడను కాగల భాగ్యం లభిస్తుంది.

ఇట్లు
గోపాలం."

ఈ జాబు చదివి రేఖ శశిరేఖ ప్రక్కనే కూర్చుంది. "నిజానికి అక్కా, నా మనస్సులో గోపాలాన్ని చూచి నపుడు ఏవేవో ఊహలున్నా, ఆయన కూడా నన్నుగూర్చి కలలు గంటున్నా డని ఊహించలేకపోయాను" అంది.

శశిరేఖ లోలోపల దుఃఖం పొరలు కొస్తున్నా లేని ధైర్యాన్ని తెచ్చుకొని చిరునవ్వు నవ్వింది.

"అక్కా, మరి ఈ మాట నాన్న తోనూ, అమ్మతోనూ ఎలా చెప్పడం?" అని అడిగింది రేఖ.

"ఏది చెల్లీ, ఆ జాబు యివ్వు. నాన్నతో, అమ్మతో నేను చెబుతాను" అని ఆ జాబును తీసుకుంది.

రేఖ సంతోషంతో అద్దం ముందుకు పరుగులెత్తింది. శశిరేఖ ఆ జాబుతీసి చదివింది.

"నాహృదయ సుందరికి —

ఈ విధంగా నిన్ను పిలవాలని ఎన్నో రోజులనుండి కలలు గంటున్నాను. ఆ విషయమే మా తలిదండ్రులకు తెలియ జేశాను. మన వివాహానికి అంగీకరిం చారు. ఇంక మీ పెద్దల అంగీకారమే ఆలశ్యం.

ఇట్లు
నీ గోపాలం".

ఎంత మోసం చేశాడు గోపాలం. కాని అతని తప్పేముంది. నాకంటె చెల్లి చురకయినది అనుకొని మళ్ళీ కన్నీరు కార్చింది శశిరేఖ.

చెల్లెలి పెళ్ళి విషయమై తలితండ్రు లకు తెలియ పరచింది శశిరేఖ. వారి అంగీకారాన్ని తెలిపినా ముందు అక్క పెళ్ళి అయితేగాని చెల్లెలిపెళ్లి చేయడం సవ్యంకాదని స్పష్టపరచారు. ఆ విషయమై శశిరేఖతండ్రి గోపాలా నికి జాబు వ్రాశాడు.

గోపాలం జాబు చూచి కొయ్యబారి పోయాడు. తేరుకొని మళ్ళీ మళ్ళీ చదివాడు.

"చి॥ గోపాలం,

నీవు మా రేఖకు వ్రాసిన జాబు చూచాను. మీ యిద్దరి మనస్సులు కలిసి

నప్పుడు వివాహం జరిపించడానికి మా అభ్యంతరం లేదు కాని, ఒక్క షరతు మా పెద్దమ్మాయి శశికి ముందుగా వివాహం జరగాలి అందుచేత నీవు ఒక్క సంవత్సరకాలం వివాహాన్ని వాయిదా వేసుకోవాలి ఈ షరతు సబబుగా ఉంది కనుక నీ అంగీకారం లభిస్తుందని ఆశిస్తున్నాను "

తలిదండ్రులకి కూడా చెప్పకుండా రైలెక్కాడు గోపాలం తను ప్రేమించినది శశిరేఖను కాని ఈ పొరపాటు ఎక్కడ జరిగింది? ఈఆలోచనల లోనే మునిగి గోపాలం మద్రాసు చేరాడు శశిరేఖ యింటికి వెళ్లాడు

గుమ్మంలో రేఖ సిగ్గుతో తలవంచుకొని ఓ కంట చూచి "ఏవండీ, అకస్మాత్తుగా వచ్చారు" అని ప్రశ్నించింది కొంటెగా

"రేఖా, గొప్ప పొరపాటయింది నీతో ఒక్క నిముషం మాట్లాడాలి అందుకే అంతదూరం నుండి వచ్చాను" ఏకదాటిగా చెప్పాడు గోపాలం

రేఖకు అతని తొందరపాటు అర్థం కాలేదు ఏం జరిగిందని ప్రశ్నించింది

"రేఖా, మీ అక్క శశిరేఖను నేను ప్రేమించాను ఆమె కూడా నన్ను ప్రేమించింది మేం యిద్దరం వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాం" అన్నాడు

"మరి నాకు వ్రాశారు కదండీ" అంది రేఖ అమాయకపు చూపు చూస్తూ

"అదే, పొరపాటు జరిగింది. ఆ జాబు మీ అక్కకు ఉద్దేశించి వ్రాసినది. బహుశా కవర్లు మారి ఉండవచ్చు. జాబులలో మీ పేర్లు వ్రాయక పోవడం వల్ల ఈ పొరపాటు జరిగి ఉండవచ్చు రేఖా! ఈ సమయంలో నువ్వే నన్ను కాపాడాలి" అంటూ బ్రతిమాలాడు.

రేఖ ఒక్క నిమిషం మౌనం వహించింది తన చీర కొంగుతో నుదటి చెమట తుడుచుకుంది కనుబొమ్మలు పైకెత్తి చిరునవ్వు నవ్వి గోపాలం చెయ్యి పట్టుకొని "రా బావా జరిగిందంతా యింట్లో చెబ్దాం" అని గోపాలన్ని లోపలకు ఈడ్చుకు పోయింది

నెల తిరగక ముందే గోపాలానికి— శశిరేఖకు వివాహ ముహూర్తం పెట్టారు వివాహం జరిగింది కాలేజీలో చూపులు కలిసిన నాటి చిరునవ్వే కల్యాణ మంటపంలో నవ్వుతున్నారు. దూరం నుండి వారి ఆనందాన్ని చూసి తనలో తాను నవ్వుకుంది రేఖ



స్కెచ్ :

# సంక్రాంతి సంబరం

పసుపు రాసులు పోసినట్టు బంతిపూలు పచ్చ పచ్చగా, వెచ్చ వెచ్చగా పూసినై. చేమంతులు రాజుల పూలైతే బంతిపూలు రైతుల పూలు. నల్లటి కొప్పులో పచ్చని బంగారంలాంటి బంతి పూవు చెక్కుకుని సీత పొలం పక్కగా నడిచి పోతుంది. రాముడు గడ్డివామిలో కూచుని దానివైపు చూసి మురిసిపోతాడు. చలిగాలి కత్తిలా కోస్తుంది. పైటకొంగు తల మీదికి ముసుగులా లాక్కుంటుంది సీత. గడ్డి వంటినిండా కప్పుకుంటాడు రాముడు. కళ్లకు పచ్చ పచ్చగా, వెచ్చ వెచ్చగా బంతిపూలు, మనసులో కమ్మ కమ్మగా వలపులు.

సంక్రాంతి రానే వచ్చింది. గరిసెల్లో, గాదెల్లో నిండుగా ధ్యానం. నిరుపేద వాడు సంక్రాంతినాడు మహారాజు. కొత్త బియ్యపు అన్నం తియ్య తియ్యగా దిగు తుంది. లేత లేత ఊసబియ్యం కంకులు కాల్చుకుని నములుతుంటే పాలూరు తాయి. సజ్జరొట్టెలు కాల్చుకుంటు న్నారు కొందరు, నువ్వులు బొక్కుతు న్నారు కొందరు. సీతకి తిండి మీద దృష్టిలేదు. ముగ్గులంటే దానికి సరదా. రంగు రంగుల పిండితో ముగ్గులు పెట్టింది ఇంటి ముంగిట. పేడతో గురు గులు చేసింది. ఆ గురుగుల్లో రంగు రంగుల పూలు గుచ్చింది. నూలు, బియ్యం, రేగుబండ్లూ నింపింది. అక్క డక్కడా ముగ్గులు చెరిపి మళ్లీ సరిదిద్దు తున్నది. బొటన వేలుతో నేలను రాస్తూ ఏదో ఆలోచిస్తున్నది. రాముడు దూరం నుంచి చూశాడు. ముగ్గులు సరిదిద్దుతున్న సీతని చూసే వరకు వాని గుండెలో ఎవరో గుస గుస లాడారు. దగ్గరిగా వచ్చాడు. వెనక నుంచున్నాడు. కొప్పు లోని బంతిపూవు పక్కున నవ్వింది.

ఏదో చప్పుడైనట్టై గిరుక్కున వెనక్కు తిరిగి చూచింది సీత. రాముడు అటు తిరిగి చూస్తున్నాడు. "దొంగ యేంటీ ఆట ?" అంది సీత.

"అంతలో పొలంలోంచి ఇంటి కొచ్చి ముగ్గులు పెడుతున్నావే ?" అన్నాడు రాముడు.

''పొలంలో నన్నెక్కడ చూసినౌ?'' అని అడిగింది సీతి.

''చూశిన, గడ్డి వామిలోనుంచి''

''దొంగ చూపులు ఎప్పుడు నేర్చినౌ?''

దాశరథి

"ఇప్పుడిప్పుడే నేరుస్తున్న''

"పండగపూట ఇంటికి పో''

"ఇదే నా యిల్లు. నేను పోనేపోను''

''అయ్య తంతడు''

"ఎందుకూ ?''

''ఆడపిల్లల యెంట పడ్డందుకు''

''మరి మొగపిల్లల యెంట పడ మంటవా ?''

''ఏమో. నీకు జవాబులు చెప్పలేను. పో''

''నేను పోనంటే పోను''

''అదుగో అయ్యొస్తున్నడు'' అంది సీత. ఉలిక్కి పడి ఇంట్లోకి చూశాడు రాముడు. అయ్యలేడు కొయ్యలేడు.

''అమ్మ దొంగా ! భయపెడతావ్?'' అని సీతని పట్టుకున్నాడు రాముడు. సీతకి భయంవేసింది. విదిలించుకుంది. కాని రాముడు వదల్లేదు.

అంతలో దూరం నుంచి సన్నాయి వినపడ్డది. పిల్లలు అల్లరిగా అరుస్తు న్నారు. ఇద్దరూ అటువైపు చూశారు. నందీశ్వరుడిలాగా ఎత్తైన మూపురం, దాని మీద చుట్టిన ఎర్రటి సిల్కు సెల్లా, వీపున రంగు రంగుల బొంద, మెడలో మువ్వలు, మొఖాన బొట్టు, గంభీరంగా వుంది గంగిరెద్దు. ముందర ఒకడు సన్నాయి వాయిస్తూ నడుస్తున్నాడు. వెనక వొకడు డోలు వాయిస్తున్నాడు. వెంట పిల్లలు పరుగెత్తుకు వస్తున్నారు.

''గంగెద్దొస్తున్నది'' అంది సీత.

''రానీ. దాన్నడుగుతా మన పెళ్లె ప్పుడో'' అన్నాడు రాముడు.

''అమ్మో ! పెళ్లే? నీకు పిల్లనెవ్వ డిస్తాడు ?''

''మీ అయ్య''

''మా అయ్య నీకు నిజంగానే పెళ్లి చేస్తాడు''

''మరింకేం ?''

''కర్రతో పెళ్లి''

''అట్లగా అదీచూస్తా" అన్నాడు రాముడు. గంగిరెద్దు ఇంటి ముందు ఆగింది.

"పెబువు గారికీ దణ్ణం పెట్టు" అన్నాడు గంగెద్దుల వాడు. ముందటి కుడికాలు వంచి దండంపెట్టింది గంగి రెద్దు. గొల్లు మన్నారు పిల్లలు.

"బాబు పెళ్లి ఈ యేడైతుందా చెప్పు బసవన్నా !" అన్నాడు గంగెద్దుల వాడు.

తల వూపింది యెద్దు. సీత యిం ట్లోకి పరిగెత్తింది. పాత ధోతి తెచ్చి ఇచ్చింది గంగెద్దులవాడికి. రాముడు ముసి ముసి నవ్వులు నవ్వాడు. గంగి రెద్దు మళ్లీ వంగి దణ్ణం పెట్టింది. గంగె ద్దుల వాడు డబడబా డోలు వాయించాడు. పిల్లలు కిలకిలా నవ్వారు. సీతతల్లి వొడ్లు చాటలో తెచ్చి గంగెడ్ల వాడి జోలెలో పోసింది. ఇటు చూసేవరకు రాముడు కనపడ్డాడు. ఆమెను చూడగానే మొఖం తిప్పుకొని దూరంగా పోతు



"ఏమయ్యా కుర్చీ కొనుక్కొస్తున్నావా ఏమిటి?"
"లేదండి సినిమా కెళ్తున్నా. హాల్లో నల్లుల బాధపడలేక కుర్చీ యింటినుంచే తీసుకెళ్తున్నా."

న్నాడు రాముడు. సీత తల్లి రాముణ్ణి పిలిచింది. దగ్గరగా వచ్చి నిలుచున్నాడు.

''ఏం నాయనా పోతున్నావు?" అని అడిగింది.

"ఏం లేదత్తా'' అన్నాడు రాముడు.

''అయ్య చూస్తాడని బయపడుతు న్నడు'' అంది సీత. ''నాకేం బయం'' అన్నాడు రాముడు. అన్నాడే గాని గుండె గతుక్కు మంటున్నది. బుర్రమీసాల పుల్లయ్య కర్ర తీసుకొని ఎటునుంచొ స్తాడో అని భయంగానేవుంది.

"మాకూ మీకూవున్న పాత పంచాయి తీలకు మీరు కష్టపడుతున్నారు నాయనా మీరేం చేశారని?" అంది సీత తల్లి.

"ఆ ఆలోశన అయ్యకు లేదవ్వా" అంది సీత

''ఎప్పు డొస్తదో బుద్ది'' అని తల పట్టుకుంది సీత తల్లి.

"రమారమణ గోవిందో హరి

హరిలొరంగ, రంగ హరిలొరంగ''

అంటూ సాతాని జియ్యరు గెంతుతూ వచ్చాడు. నున్నగా రాగి చెంబులాంటి తల. తలమీద గుడ్డచుట్టకుదురు. కుదురు మీద రాగి అక్షయపాత్ర. దానికి బంతి పూల హారం. మొఖాన దట్టంగా ఊర్ధ్వ పుండ్రాలు మెడలో బంతిపూల దండలు

నడుముకు ఎఱ్ర పట్టుకండువా, పింజాలు పోసి కట్టిన తెల్ల ధోతి, చేతిలో చిరతలు, బొమ్మలెగరేస్తూ, పాడుతూ, హుషారుగా వున్నాడు జియ్యరు. అతన్ని చూసి పక్కున నవ్వింది సీత. "నవ్వితే నవ్వావుగానీ నువ్వులు దానం చెయ్యమ్మా!'' అన్నాడు జియ్యరు.

"బావా! నువ్వులు కావాలట'' అంది సీత.

"తెచ్చిపెట్టవే సీతా!'' అని బుగ్గ మీద గిల్లాడు రాముడు.

"ఎవఁడ్రా వాడు'' అని అరుపు వినిపించింది. ఉలిక్కిపడి చూచారంతా. బుఱ్ఱ మీసాల పుల్లయ్య కఱ్ఱ తీసుకుని ఉరికొచ్చాడు. చస్తినిరా అనుకుంటూ రాముడు లగెత్తాడు.

"పండగనాడు వాడిమీదకు ఉరుకుతవేమయ్యా! వాడేమన్నడు?'' అంది సీత తల్లి.

''ఆడు మనింటి కెందు కొచ్చినట్టు అంట?''

"ఏదో ఆడుకుంటాని కొచ్చిండు"

"మీసాలు గడ్డాలు వచ్చినై. ఇంకా ఆటా? అయినా ఆడపిల్లతో ఏమాట?"

"చిలకా గోరింకల్లా వున్నారయ్యా! పెండ్లి చేయండి" అన్నాడు జియ్యరు.

"సాతానాయనా! నోరు మూసుకొని నీ దారిన నువ్వు పోతవా? పండగనాడు పంచాయితి పెట్టుకుంటవా?" అని గర్జించాడు బుఱ్ఱమీసాల పుల్లయ్య.

"పంచాయతి నా కెందుకు బాబూ. మీ ఇల్లు చల్లగుండ. సామగ్రి ఇప్పించండి" అన్నాడు జియ్యరు.

"పడేయవే బియ్యం" అని అరిచాడు పుల్లయ్య. సీత భయం భయంగా దోసిలి నిండా తెల్లటి బియ్యం తెచ్చి ఎఱ్ఱటి రాగి అక్షయపాత్రలో పోసింది. అక్షయపాత్ర ఆమెకు అందేట్టు మోకాలి మీద గరుత్మంతుడిలా వంగాడు జియ్యరు. దోసిలి సాచి పాత్రలోకి బియ్యం జారవిడిచింది సీత. కంటిలోనించి కన్నీటి చుక్క జియ్యరు భుజంమీద రాలింది. వేడి కన్నీటి చుక్క భుజంమీద పడేసరికి జియ్యరుకు అర్థమైపోయింది సీత బాధ.

"ఇక పో" అని అరిచాడు పుల్లయ్య.

"పోతున్నా! చల్లగా వర్ధిల్లు తల్లీ" అంటూ వెళ్లాడు జియ్యరు. దూరంగా చిరతల మోత వినిపిస్తుంటే అటేచూస్తూ నిలుచున్నది సీత. ఆ పూట సీతకి అన్నం సయించ లేదు. "పండగనాడు అన్నం సరీగా తినవేమే?'' అని తల్లి అడిగితే జవాబు చెప్పకుండా చేయి కడుక్కుని లేచిపోయింది సీత.

చుట్ట కాల్చుకుంటూ ఇంటిముందట అరుగు మీద కూచున్నాడు పుల్లయ్య. ఇంతలో సుబ్బరామయ్యగారు దారిన వెళుతూ పుల్లయ్యను చూశాడు.

"రండి రండి దండాలు" అన్నాడు పుల్లయ్య.

"దీర్ఘాయుష్మాన్ భవ. ఏం పుల్లయ్యా!"

"ఏముందీ. సంకురాత్రి వొచ్చింది. పండుగలు వస్తుంటాయి పోతుంటాయి. పండగ పండగకూ హడావుళ్లు" అని నసిగాడు పుల్లయ్య.

"అలా అనకు పుల్లయ్యా! సంకురాత్రి పెద్ద పండగ. పండగల్లో కెల్లా పండగ. ఇవాళ సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశిస్తాడు."

"ఏడకు పోతే మన కేమిటంట."

"అట్లా కాదు పుల్లయ్యా! ఇవాళటితో నరకద్వారం బంద్దైతుంది. స్వర్గద్వారాలు తెరుచు కుంటాయి. అందుకే భీష్ముడు ఉత్తరాయణం వచ్చేదాక జీవించివుండి ఆ తరువాత ప్రాణాలు విడిచాడు" అని వివరించాడు సుబ్బరామయ్య. ఇంతలో ఇంట్లోనుంచి సన్నగా ఏడ్పు వినపడ్డది.

"ఎవరా పండగ నాడు ఏడుస్తున్నది?" అనడిగాడు సుబ్బరామయ్య.

"తల్లన్నా అయ్యుండాలి, పిల్లన్నా అయ్యుండాలి" అన్నాడు పుల్లయ్య.

"పండగనాడు ఏడ్పెందుకు?"

"అదుగో! ఆ రాముడుగాడితో పరాచికాలు వద్దన్నానని."

"ఇదుగో పుల్లయ్యా! రాముడు పేద వాడు కావచ్చు గాని మంచివాడు. ఎప్పటి వైరాలో మనసులో పెట్టుకుని మాణిక్యాన్ని పారేసుకోకు."

"ఏం మాణిక్యమో!"

"తప్పిపోయినాడు తెలుస్తుంది మాణిక్యం విలువ" అన్నాడు సుబ్బరామయ్య.

"అట్లా చెప్పండయ్యా?" అంటూ వచ్చింది సీత తల్లి.

"ఇవాళ పెద్ద పండగ. పేదలకూ సాదలకూ అందరికీ పండగ. ధాన్యం లక్ష్మివంటిది. ఇళ్ళల్లో ప్రవేశించిన మంచి రోజుల్లో ఈ పండగ వస్తుంది. కనుక ఇవ్వాళ అన్ని ద్వేషాలు మరిచిపోవాలి." అన్నాడు సుబ్బరామయ్య. గబగబా ఇంట్లోకి వెళ్లాడు. సీతని బయటటికి తీసు కొచ్చాడు.

"నీవు నా కూతురులాంటి దానివి. నీ శోభం అయ్యేట్టు చేస్తానమ్మా" అంటూ ఓదార్చాడు.

"ఇదుగో పుల్లయ్యా! నా మీద ఏ మాత్రం గురివున్నా నా మాట విను. నీకు మేలు కలుగుతుంది. పెద్ద వాణ్ణి చెబుతున్నా!" అన్నాడు సుబ్బరామయ్య.

ఇంతలో చుట్టుపక్కల పిల్లలంతా వాకిట్లో గుమిగూడారు.

"గొబ్బిళ్లో గొబ్బిళ్లో" అంటూ గొబ్బి తట్టడం మొదలు పెట్టారు. హృదయంలో ఏ మాత్రం కళంకంలేని ఆ పసిపాపలను చూస్తుంటే పుల్లయ్య మనస్సు జల్లుమంది.

"అయితే ఏం చేయమంటారు సుబ్బరామయ్యగారూ!" అంటూ దగ్గరగా వచ్చాడు పుల్లయ్య.

"నా మాట విని ఈ పెద్ద పండగ నాడు నీ మనస్సు మార్చుకో. రాముడి తండ్రికీ, నీకు వున్న తగాదా అతను పోయిన్నాడే పోయిందనుకో. చచ్చి ఏ స్వర్గాన ఉన్నాడో అతనూ ఆనందిస్తాడు. రాముడి కిచ్చి సీతని పెళ్లి చేయి'' అన్నాడు సుబ్బరామయ్య.

కిలకిల నవ్వింది సీత. ఇంట్లోకి కొత్త వెలుతురు ఒచ్చినట్టైంది. హృదయాలలో వెచ్చదనం ప్రవేశించింది.

రాముడు దూరంగా దాక్కుని దాక్కుని వెళ్లిపోతున్నాడు. సుబ్బరామయ్య కంట పడ్డా డతను.

''అరే రాముడూ! ఇంకా భయ మెందుకూ! రా" అని పిలిచాడు సుబ్బ రామయ్య. రాముడు రాలేదు. పుల్లయ్య వాకిట్లోకి వచ్చి "రాముడూ" అన్నాడు.

"రా నాయనా! రా'' అంది సీత తల్లి. సీత సిగ్గుతో ఇంటోకి పరిగెత్తింది. రాముడు తల వంచుకుని వచ్చి ఇంటి ముందర నిలబడ్డాడు.

''డూ డూ డూ బసవన్నా!" అంటూ పాడుకుంటూ పోతున్నాడు గంగెద్దుల వాడు. ''బసవన్నంటే ఆ ఎద్దుకాదు. మా పుల్లయ్యే ఇవాళటి నించి బసవన్న. మేం చెప్పినట్టు వింటాడు" అన్నాడు సుబ్బరామయ్య.

''మీ మాట చలవవల్ల మా యిల్లు నిలబడింది సుబ్బరామయ్యగారూ" అంది సీత తల్లి.

"అదంతా నా మహిమకాదు. సంకు రాత్రి మహిమ. సూర్యుడు అడుగో మనందరికీ సాక్షి. ఆతడు మకరంలోకి ప్రవేశించాడు. పుల్లయ్య తన మొసలి పట్టు వదిలిపెట్టి దారికొచ్చాడు'' అన్నాడు సుబ్బరామయ్య.

''ఏదో నాకు సరైన దారి చూపిం చారు సుబ్బరామయ్యగారూ" అన్నాడు పుల్లయ్య. గబ గబా లోపలికిపోయి ఇన్ని దోసకాయలూ, లేత లేత జొన్న కంకులూ తెచ్చి సుబ్బరామయ్య ఒడిలో పోశాడు. రాముడు సుబ్బరామయ్యకు దండం పెట్టాడు.

"అత్తా మామలకు దండంపెట్టు. నాకు దండం పెట్టడానికేం గాని'' అన్నాడు సుబ్బరామయ్య.

అంతా కిలకిలా నవ్వారు. రాముడు సమయంచూచి తుర్రుమన్నాడు. సీత పెరటి దారిని పొలంగట్టుకు చేరింది. గడ్డివామి వద్ద ఇద్దరూ కలుసుకున్నారు. వాలిపోతున్న సంక్రాంతి సూర్యుడు వారి ఇరువురి ఒడులలో దోసిళ్లకొద్దీ బంతిపూలు కుమ్మరించాడు. ★





# యువతీలోకం



## ప్రేమ స్వభావం

ప్రేమ కలాపంలో చూపులకు ఒక స్థానం వుంది. కుటుంబ జీవితానికి సంబంధించిన ప్రేమ శారీరకం అవటం వల్ల అలా వుండటం కొంతవరకు సహజమే. ఈ రంగంలో, "శారీరక నిర్ణయం మానసిక నిర్ణయమంత విలువైనది" అన్నాడు కామస్.

అయితే ఈ ఆకర్షణ ఎటువంటి స్త్రీ పురుషుల మధ్య కలుగుతుంది అనేది ప్రశ్న. ఈ ప్రశ్నను మేధావులు రకరకాలుగా తరిచారు.

ప్రొఫెసర్ విన్ట్ అనే ఆయన అనేక పరిశోధనలు చేసి, "ప్రేమికులు తమలో లేనిదానిని ఇతరులలో చూడటానికి ఉబలాటపడతారు" అని చెప్పారు. దీనికి ఆయన కాంప్లిమెంటరీ సిద్ధాంతం అని నామకరణం చేశారు. "ప్రేమ వర్ధిల్లాలంటే, దాని వల్ల ప్రేమింపబడే వ్యక్తికాక, ప్రేమించే వ్యక్తి ఏదో వొక విధంగా లాభపడాలి. ఈ ఆవేశంలో ఏదో వొక రూపంలో స్వార్థం వుండి వుండాలి," అన్నారు.

స్త్రీ, పురుష ప్రేమ ఆవేశాల్లో కొంత భేదం లేకపోలేదు. పురుషుని కంటే స్త్రీ నిలకడగా ప్రేమించ గలుగుతుంది. ఒక వ్యక్తిమీద దృష్టిని నిలిపి తన ప్రేమను స్థిరంగా కేంద్రీకరించ గలుగుతుంది. అయినప్పటికీ ఆమె ప్రేమలో సైతం స్వార్థం లేకపోలేదు.

ప్రతి వ్యక్తి తనలోలేని గుణాలు కలిగిన వ్యక్తిని ప్రేమిస్తాడు. తన నిరాశలనూ, సంఘర్షణలనూ, చిత్త సంక్షోభాన్నీ, ఎదుటి వ్యక్తి ద్వారా తీర్చుకోటానికి ప్రయత్నిస్తాడు. తనకు తీరని కోరికలు అవతలి వ్యక్తి ద్వారా తీర్చుకుంటాడు. వ్యక్తులు ఒకరి నొకరు ఈ విధంగా ఆకర్షించుకుంటారు. ప్రేమలో వున్న ఆకర్షణకు ఇదే పునాది.

ఒక వ్యక్తి ప్రేమ జీవితాన్ని, "ఆమెలో ఏమి చూచి ప్రేమించాడో తెలియకుండా వుంది!" అని చాలా మంది విమర్శిస్తూ వుంటారు ఆ వ్యక్తి ప్రవర్తనకు విస్తుపోతారు. అతనిని ఆకర్షించింది తనలో లేని గుణాలు అవతలి

---

వసుమతీ రామారావు

వ్యక్తికి ప్రస్ఫుటంగా వుండటమే అని తేల్చుకున్నప్పుడు అతని ప్రవర్తన మనకు చోద్యంగా వుండదు.

కాబట్టి ప్రేమోద్దీపనకు అవసరం తీరటం అనేది ముఖ్య ప్రేరణగా పని చేస్తుంది. అలా జరగనప్పుడు ఆ దాంపత్య జీవితం సుఖప్రదంగా వుండదు. అర్ధాంతరంగా తెగిపోతుంది.

కొంతమంది ఒక స్త్రీని ప్రేమించి, వివాహమాడి, ఆ స్త్రీని తాము ప్రేమించటానికి కారణం తెలుసుకోలేక, తమకు మల్లే ఆమెను దిద్దుకోటానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం సఫలం అయితే, వ్యక్తి తనలాంటి వ్యక్తితో ఆకర్షింపబడలేదు గనుక, వారి ప్రేమకు విఘ్నం కలిగి తీరుతుందని మోర్టాన్‌హన్ట్ అనే ఆయన విశదపరిచాడు.

అయితే ఈ ప్రయత్నం సఫలం కాకపోవటానికే ఎక్కువ అవకాశాలు వుండటం అతని అదృష్టం. మార్చాలనే అభిలాష కలిగిన పురుషుడు ప్రేమించిన స్త్రీ మారేదై వుండకపోవటం సహజం అవటం ఇందుకు కారణం.

యువకులకు సంఘంలో ప్రఖ్యాతులం కావాలనే అభిలాష వుంటుంది. కీర్తిని పొందాలనే అభిలాష వుంటుంది. వారంత వారు అకస్మాత్తుగా ఆ స్థితికి రాలేరు. అందువల్ల ఏ సినిమా స్టారునో ప్రేమించి, ఆమె ఖ్యాతినీ, కీర్తినీ తమదిగానే భావించి తృప్తి పొందుతారు. చండ ప్రచండులైన వీరులుంటారు. వారు తమను లాలించే లేత వయస్సు గలిగిన స్త్రీల చేతుల్లో బానిస లౌతారు. తమలో ఆడపాళ్ళు ఎక్కువగావున్న పురుషులూ, కవులూ, గాయకులూ మొదలైన కళాకారులూ మగపాలు ఎక్కువగా వున్న స్త్రీలనూ, మగ పాళ్ళు ఎక్కువగావున్న స్త్రీలు ఆడపాళ్ళు ఎక్కువగా వున్న పురుషులనూ ప్రేమించటం మనం జీవితంలో నిత్యం చూస్తున్న సమాచారమే.

ప్రేమికులు అనేకులమీద చేసిన పరిశోధనలను బట్టి, విన్చ్, "పెత్తనం చేసే స్వభావం వున్నవారు పెత్తనం చేయించుకునే స్వభావం ఉన్న వారిని ప్రేమించటం మానవుల యొక్క సహజ స్వభావం" అని తేల్చాడు. ఒకరు ప్రఖ్యాతికోసం తాపత్రయపడే స్వభావం గలవారైతే, రెండవ వారు ఇంటిపట్టున ఉండ ఇచ్ఛగించే వారవుతున్నారు. సాత్విక స్వభావం గల వారు ఆవేశపరులను ప్రేమిస్తున్నారు. కలుపుగోలుగా వుండేవారూ, రిజర్వుడుగా వుండేవారూ దంపతులుగా వుంటున్నారు.

దీనితోపాటు ఆయన భగ్నమైన ప్రేమ జీవితాలను కూడా పరిశీలించాడు. అవికూడా ఆయన సిద్ధాంతాన్నే బలపరిచాయి. తమ స్వభావాన్నీ, అవసరాలనూ తెలుసుకోలేని వారే భగ్న మనో




పోలికలు

రధు లవుతున్నారని ఆయన ఋజువు చేశాడు.

ఈ పరిశోధనలను బట్టి, చిన్నప్పుడు జరిగే వివాహాలూ, తలిదండ్రులు నిర్ణయించే వివాహాలూ మంచివి కావని విదితం అవుతుంది. పూర్వం ఇటువంటి వివాహాలు జరగలేదా, దాంపత్య జీవితాలు సాగిపోలేదా అంటే, ఆనాటి పరిస్థితి వేరు. ఆనాడు మంచైనా, చెడైనా భార్యకు భర్తను అంటిపెట్టుకొని బ్రతకటం కంటే గత్యంతరం లేదు. అందువల్ల భార్యాభర్తల స్పర్థలు పైకి పొక్కలేదు. విడిపోయేదాకా రాలేదు. అంతేగాని ఆనాడు సుఖంగా జీవించిన వారూ, బ్రతుకును దుఃఖభూయిష్టంగా వెళ్ళబోసుకున్న వారూ వున్నారు. సుఖంగా జీవించిన వారు నేను పైన వర్ణించిన స్వభావాలు గల దంపతులేనని వెనుకకు తిరిగి చూసుకుంటే మనకు తెలియక పోదు

ఈ పరిశోధనల వల్ల కలిగిన జ్ఞానం, మన మధుర ఆవేశాలు నిలకడగా వుండగలందులకు తోడ్పడుతుంది. అవి విచ్ఛిన్నమై, మానవుడు నిరాశా జీవి కాకుండా కాపాడుతుంది. దంపతులు ఒకరి నొకరు సానుభూతితో అర్థం చేసుకొని, వొక దివ్యమైన వినూత్నన సృష్టికి కారణ భూతులవటానికి అవకాశం ఇస్తుంది ఆలోచించి చూస్తే మన అర్ధనారీశ్వర భావం యొక్క పరమార్థం ఇదేనేమో అనిపిస్తుంది.



# ట్యుటారా

ఇది బల్లికాదు. ట్యుటారా! 30 అంగుళాల పొడవు వుంటుంది. చూడటానికి విపరీతముగా, భయంకరంగా, శరీరపు రంగులు మారుస్తూ ఉంటుంది. చిన్నచిన్న పక్షులను తినగలదు. సాధారణంగా బొరియల్లో నివసిస్తూ రాత్రిళ్లు బయలుదేరుతుంది ఆహారం సంపాదించటానికి. దీని పూర్వీకులు 2 కోట్ల సంవత్సరాలకు పూర్వం ఉండేవారని అంచనా. నవంబరు నెలలో ఆడ ట్యుటారా ఒక డజను గ్రుడ్లు పెడ్తుంది. అవి మార్చిలో పిల్లలౌతాయి. ఈ క్రింది బొమ్మలోని ట్యుటారా వయస్సు ఎంత ఉంటుందని? 180 సంవత్సరాలంటే ఆశ్చర్య పడకూడదు. ఆ వెనకనున్న ఆడదాని వయసు 21 సంవత్సరాలు మాత్రం.



# కుమార్తెలకు కాస్త ఓర్పు వుంటే?

రెండు తరాలకుమధ్య ఘర్షణ అనేది వుండటం ఈ నాటి పరిస్థితుల్లో తప్పని సరే అవుతూవుంది రెండు తరాలవారూ రెండు విభిన్న పరిస్థితులను ప్రతిబింబించటంవల్ల ఘర్షణ అనివార్యం అవుతూవుంది

తల్లికి పిల్లలు ఎప్పుడూ పసివాళ్లుగానే కనుపించడం సహజం అందుకని వాళ్లకు ఎప్పుడూ నీతులు ఉపదేశించే అలవాటు ఆమెకు ఉంటుందీ పిల్లలు ఎల్లకాలం తను చెప్పినట్లు వినాలనే కుతూహలం ఆమెకు ఉంటుంది వాళ్ల జీవితాలనుతీర్చి దిద్దవలసిన బాధ్యత తన మీద ఉందని తల్లి భావిస్తుంది

పిల్లలు పెద్దవాళ్లవటం ఏ తల్లీ వెంటనే గుర్తుపట్టలేదు అందువల్ల పసి పిల్లలకు బోధించినట్లు ఆమె బోధిస్తూనే వుంటుంది

ఎదిగిన పిల్లలకు, తల్లి పై స్వభావం వల్ల, ఛాందసురాలిగా కనపడటం కద్దు కాలేజీల్లో చదువుకునే ఆడపిల్లలు వచ్చి, ''ఇవ్వాళ సినిమాకు వెళ్దాం'' అంటారు

''ఎందుకే ఆ బొమ్మలకు డబ్బు తగలెయ్యటం ?'' అంటుంది తల్లి

తల్లి చాదస్తానికి వాళ్లు నవ్వుకుంటారు

ఆనాడు వస్తూవుండగా విద్యార్థులు కొందరు కనుపించారనీ, వాళ్లను ఏడిపించామనీ చెపుతారు పిల్లలు

''ఎందుకే మగపిల్లల జోలీ''

అంటుంది తల్లి

తల్లి చాదస్తానికి వాళ్లు నవ్వుకుంటూ, ''నీకు తెలియదులే అమ్మా'' అంటారు

''పెద్దవాళ్లకి కాస్త మర్యాద ఇవ్వండే'' అంటుంది తల్లి ''ఎందుకు ఇవ్వాలి ?'' అంటారు పిల్లలు

ఈ విధంగా పెరిగేవాళ్ళు ఏమయి పోతారో అని విచారిస్తుంది తల్లి

''వాళ్ల ఇళ్లకీ వీళ్ల ఇళ్లకీ తిరక్కండే'' అంటుంది తల్లి

''స్నేహితుల ఇండ్లకు వెళ్తే ఏమి?'' అంటారు పిల్లలు

ఈ విధంగా తిరిగే వాళ్ళు ఏమయి పోతారో అని విచారిస్తుంది తల్లి

శ్రీమతి మనోరమ

కాని తల్లికి, పిల్లలకి కాస్త ఓర్పు అనేది వుంటే ఈ పరిస్థితి సంఘర్షణకు దారితీయవలసిన అవుసరం వుండదు. కొత్త పరిస్థితులకు తల్లి కొంతవరకు ఎడ్జస్ట్ కాగలుగుతుంది. తల్లికి తమ కంటే జీవితానుభవం ఎక్కువ వున్నదని పిల్లలు గ్రహించ గలుగుతారు.

అయితే పిల్లలు గమనించవలసిన ముఖ్య విషయం వొకటి వుంది. తల్లి దండ్రులను అచ్చగా తమకోసమే బ్రతకమని వారు కోరరాదు. వారి జీవితం వారికి వుండనివ్వాలి. ఊపిరి పీల్చు కునే అవకాశం వారికి ఇవ్వాలి.

తలిదండ్రుల పట్ల స్నేహభావం సానుభూతీ లేనప్పుడు ఏంచెయ్యాలి? అనే ప్రశ్న వొకటి వుంది. ఈ విషయం చర్చిస్తూ మైకేల్ డ్రులీ అనే ఆయన ఈ పరిస్థితిని చక్కబెట్టే శక్తి కూడా వోర్పుకి వున్నదని అన్నాడు. తలి దండ్రులు వొక వయస్సులో పిల్లలను ఎక్కువ ప్రేమిస్తారనీ, అందువల్ల వారి దృష్టి మొదట్లో వాత్సల్య పూరితంగా లేనంత మాత్రాన కంగారు పడవలసిన అవుసరంలేదనీ ఆయన వ్రాశాడు. ఈకాలం,పిల్లల్లోనూ తలిదండ్రులలోనూ మార్పును తెస్తుంది. ఆ మార్పును ఒకరి నొకరు అర్థం చేసుకోటానికి సహాయ పడుతుంది. దీనికి ఉదాహరణగా ఒక ప్రఖ్యాత రచయిత్రి తన తండ్రిని ఆయనకు డెబ్బై ఏండ్ల వయస్సు వచ్చే దాక గౌరవించలేక పోయిందనీ, ప్రేమించ లేకపోయిందనీ చెప్పాడు. అప్పుడు వారికి వొకరి మీద వొకరికి కలిగిన ఆదరం కోసం ఎన్ని యుగాలైనా వేచియుండ వచ్చని ఆమె అభిప్రాయ పడిందన్నాడు.

ఓర్పు అనేది వుంటే, పిల్లలు తలి దండ్రుల జీవితాలనూ, తమ జీవితాలనూ సుఖమయం చేసుకోవటం తేలికే. తమ కోసం వారెంత కష్టపడ్డారో, తమ సమ స్యలను గురించి ఎన్ని రాత్రులు వేగిం చారో జ్ఞాపకం వుంచుకుంటే ఇదేమంత ఘనకార్యంకాదు. వొకామె, "తలిదం డ్రులు అసూయా గ్రస్తులయినా, అను మానించే స్వభావం కలవారయినా, మోటువారయినా 'యువతీ యువకుల వంటివారే" అన్నది.

ఇది నిజం. వారి సమస్యను వొక ప్రత్యేక సమస్యగా చూడకుండా వుంటే జీవనప్రయాణం వారితో కలిసి సుఖ ప్రదంగా చెయ్యగలుగుతాం. ★

# మనలో మనం

మనలో మనం చాలా చాలా అనుకుంటున్నాం. కానీ, తీరా ఆచరణలో పెట్టేటప్పుడు గట్టి చిక్కే వస్తుంది. మనలో మనం ఒకటి అనుకొని పైకి అందుకు పూర్తిగా వ్యతిరేకంగా కూడా అనేస్తాం. నా మటుకి నేనే అలా ఎన్నో సార్లు అనుకున్నాను. రోజూ ఆఫీసుకి లేటుగా వెడుతుంటే తోటి స్నేహితులు హేళనగా నవ్వుతుంటారు. నేను లేటుగా వస్తే వాళ్ళ సొమ్మేం పోయింది. ఎవరి కర్మ కువా రేడ్వక యితరుల్ని చూచి నవ్వటం దేనికో! అయినా అసలు లేటుగా రావాలని నే నెప్పుడూ అనుకోను. ఎంత త్వరగా వద్దామని మనుసులో అనుకుంటానో అంతగా లేటవుతుంది దాని తస్సగొయ్య. లేటవటానికి నీవే కారణమే మహాప్రభూ అని మా శ్రీమతితో మనవి చేద్దామను కుంటాను. కానీ వెంటనే ఆవిడ చదివే దండకం మాట గుర్తొచ్చినా విరుచుకుంటాను. ఉదాహరణకి చెప్తానుచూడండి."ఇదుగో మీరు ప్రొద్దున ఎనిమిదింటికి లేచారు. తోటపని చేస్తూ కూర్చున్నారు. ఆ పైన పొలం వాళ్ళతో బాతాఖానీ వేస్తూ కూర్చున్నారు. ఆ మీదట పిల్లల్తో ఆటలాడుతూ ఉన్నారు. ఆ తర్వాత క్షవరం చేసుకుంటూ ఉన్నారు. ఎంతసేపటికీ స్నానం చెయ్యరయ్యె. భోజనం కానివ్వరయ్యె బెల్టుకనిపించ లేదనీ, దువ్వెన కన్పించలేదనీ, చొక్కాగుండీ కనిపించ లేదనీ వెతుకుతూ కూర్చున్నా రయ్యె. పాంటు చినిగిందని అప్పుడు కుట్టించుకుంటూ కూర్చుంటిరాయె. మరి ఎవరి ఆలశ్యమో శలవిస్తారా?" అంటూ కొశ్చన్‌మార్కు పోజు పెడుతుంది. పరీక్షహాల్లో ప్రశ్నలకి సమాధానం తెలీని బండకుర్రాడిలా బిక్కముఖంబెట్టి తప్పు నానదని క్షమార్పణ కోరి, ఆ పైన లెంపలు వాయించుకొని వాలు కుర్చీలో వాలిపోవల్సి వస్తుంది.

ఇటువంటివే సవాలక్ష ఆపత్కాలాలు దాపురిస్తాయి. శ్రీమతి వచ్చి గోముగా 'ఏమండీ, ఆ ప్రక్కింటి లావుపాటి

మునిపల్లె సరోజని



"— హాఁ! పార్కులో దొరికింది."

పిన్నిగారు జరీ చీర కొనుక్కోనా'' అంటుంది. లోపల డబ్బులేదనీ, కొనే స్తోమత లేదనీ చెప్దామని అనిపించి నోటిదాకా వచ్చి చప్పున నోరుమూసు కోవడం కద్దు. కారణం 'లా'కేత్వం 'దా'కు కొమ్ము యిచ్చిన పక్షంలో మా శ్రీమతి ప్రళయకాల ఝంఝామా రుతంలాగా విజృంభించి నేను తను కాపరానికొచ్చి నప్పటినుంచీ చెయ్యని ఘనకార్యాలూ, చేసిన అపరాధాలూ పూస గ్రుచ్చినట్లు ఏకధాటిగా ఏకరువు పెడు తుంది. ఆ మారుతం యొక్క ఉధృతానికి తాళలేక 'సరేబాబు' నీకో నమస్కారం. ఆ ప్రక్కింటి పిన్నిగారి చీరకన్న మంచిదే కొనుక్కో, ఎవరైనా ముష్టెత్తుతాను' అని ప్రాధేయ పడితే అప్పుడు దేవి ప్రసన్నురాలై తన కటాక్ష వీక్షణాల ముంచెత్తి దరహాస చంద్రికలను వెద జల్లుతుంది.

ఇటువంటి ప్రమాదాలనుంచి రక్షించు కోవటానికే నేను మనసులో అనుకొని కూడా పైకి అనక దిగమ్రింగి ఊరు కుంటాను అంతేకాదు మనసులో అను కొన్నదానికి పూర్తిగా వ్యతిరేకంగా కూడా మాట్లాడుతుంటాను. మరేం చెద్దాం. 'నొప్పింపక, తానొవ్వక, తప్పించుకు తిరుగువాడు ధన్యుడు' అంటూ ఎవరో చెప్పార్లే. అంతేకాదు ఆ పెద్దలే 'ఒకచో నేలను బవ్వళించు' అంటూ కార్య సాధకుడు కష్టాల్ని లెక్కించకుండా, కాల మొక్క రీతి గడపవలయు' నన్నట్లు కాలాన్ని దొర్లిం చెయ్యాలని చెప్పారు ఏం చేస్తాం మరి. ఏ ఎండకా గొడుగు పట్టాలి. ★

# క్లియోపాత్రా

క్రీస్తుకు 48 సంవత్సరాల పూర్వం ప్రపంచంలోని సంపన్నమైన, నాగరికమైన దేశాలలో అగ్రగణ్యమైన ఈజిప్టు దేశంలో సంక్షోభ పరిస్థితి ఏర్పడింది.

దాదాపు ప్రపంచాన్నంతా జయించిన గ్రీకువీరుడు అలెగ్జాండరు చనిపోయినాక ఆయన జయించిన సామ్రాజ్యం విచ్ఛిత్తి పొందింది. అలెగ్జాండ్రియా రాజధానిగా గల ఈజిప్టుకు టోలమీ లాగోస్ ప్రభువయాడు. అటు తరవాత టోలమీ సంతతి వారు ఈజిప్టును పరిపాలిస్తూ వచ్చారు.

రోములో జూలియస్ సీజరు ప్రభ వెలిగిపోతున్న సమయంలో ఈజిప్టుకు క్లియోపాత్రా అనే అపూర్వ సౌందర్యవతీ, ఆమె తమ్ముడు 14 వ టోలమీ సమిష్టి పరిపాలకులుగా ఉన్నారు. క్లియోపాత్రా వయసు 21, ఆమె తమ్ముడు పదమూడేళ్ళ కుర్రాడు. ఈ ఇద్దరికీ మధ్య బద్ధవైరం ఏర్పడింది. క్లియోపాత్రాను దేశ బహిష్కారం చేశారు. ఆమె సిరియాకువెళ్ళి అక్కడ సేనను పోగుచేసుకుని ఈజిప్టుపైకి దండయాత్ర బయలుదేరింది. ఈజిప్టులో అంతర్యుద్ధం జరగటానికి సిద్ధంగా ఉంది.

ఈ సమయంలో జూలియస్ సీజరు పాంపేను జయించి రోముకు తిరిగిపోతూ అలెగ్జాండ్రియా వచ్చాడు. రానున్న అంతర్యుద్ధంలో తమకు సహాయం చెయ్యమని టోలమీ పక్షం వారు సీజరును అర్థించారు. సీజరు తన అనుచరులతో సంప్రదించాడు. ఆయనకున్నదల్లా ఒకటే ఆలోచన—ఈ యుద్ధంలో తాను టోలమీపక్షం వహించటంవల్ల రోముకు ఏవిధంగా లాభం చేకూరుతుంది ?

ఆ ప్రశ్నకు సమాధానం వచ్చాక సీజరు టోలమీ తరఫున తన బలాలను పోరాడనిచ్చే ఉద్దేశంతోనే ఉన్నాడు. అయితే ఇంతలో ఒక వింత సంఘటన జరిగింది. సీజరు భటులు ఆయన వద్దకు ఒక గ్రీకు వ్యాపారిని తెచ్చారు. ఆయన వెంట కొన్ని తివాసీలున్నాయి. ఆ తివాసీలచుట్ట విప్పేసరికల్లా అందులోనుంచి

ఒక అపూర్వ సౌందర్యవతి లేచి నిలబడింది నవ్వుతూ.

ఆమె క్లియోపాత్రా — ఈజిప్టు రాణీ— సూర్యుడి కూతురు, చంద్రుడి చెల్లెలు— చరిత్రలో అలాటి అపూర్వ స్త్రీ మరొకతె లేదు. అసమాన సౌందర్యరాశి — ఆమె సమక్షంలోకి రాగానే మూర్ఛపోయిన రాజులున్నారట! అందానికితోడు ఆమె ప్రజ్ఞావతి, సాహసి, చతురభాషిణి. ఆమె ఐశ్వర్యమూ, భోగమూ మ రే రాణీ ఎరగదు. రెండువేల సంవత్సరాల అనంతరం ఈనాడుకూడా ఆమె మనుషుల హృదయాలలో చెరగకుండా ఉన్నది. ఆమెకు పది భాషలు వచ్చుట.

ఆమెనూ, ఆమె తనను చేరిన విధాన్నీ చూసి సీజరు మోహముగ్ధుడై పోయాడు. క్లియోపాత్రా సాంగత్యం అనేకమంది స్త్రీల సాగత్యంతో సమానం. ఎంతోమందిలోగాని దొరకని ఆకర్షణలు ఆమె ఒక్కతెలో సీజరుకు కనిపించాయి. రాజకీయంగా చూసినా — ఆమె సీజరు భవిష్యత్తును మహోజ్వలం చేయగలది—ఈజిప్టురాణి. తనను చూసి మోహముగ్ధుడైన సీజరును క్లియోపాత్రా తన సంభాషణా చాతుర్యంతో మంత్రముగ్ధుణ్ణి కూడా చేసి తనపక్షం చేసుకున్నది. ఆనాటి రాత్రి వారిమధ్య ఏర్పడిన ప్రేమబంధం సీజరు మరణించేదాకా దృఢంగా ఉండిపోయింది. క్లియోపాత్రా కొన్ని దురాగతాలు చేసినమాట నిజమే కాని ఆమె సీజరును కేవలం స్వార్థంకోసమే ఆశ్రయించలేదు. ఆయనను భర్తగానూ, గురువుగానూ కూడా భావించి ఆయన పట్ల ఆదర్శపత్నిగా ప్రవర్తించింది.

సీజరు క్లియోపాత్రా పక్షాన టోలమీ పక్షంతో అలెగ్జాండ్రియా వద్దా, ఫారోస్ వద్దా యుద్ధాలు చేసి జయం పొందాడు. అపజయం పొందిన టోలమీ పారిపోయి నీటిలోపడి మరణించాడు. క్లియోపాత్రా ఈజిప్టుకు ఏకైక పాలకురాలయింది. ఈ అంతర్యుద్ధం కొన్ని మాసాలపాటు జరిగింది. ఒకవంక యుద్ధ కలాపాలు చూస్తూనే సీజరు విందులు కుడుస్తూ, క్లియోపాత్రాతో ప్రేమ కలాపాలలో మునిగి తేలుతూ ఇన్ని మాసాలూ ఇంద్ర భోగాలు అనుభవించాడు.

క్లియోపాత్రా సీజరుకు ఒక పిల్లవాణ్ణి కన్నది. వాడు భూమిపైన పడిన కొద్ది గంటలకు సీజరు పడవ ఎక్కి, లంగరు ఎత్తించి తన కుమారుడి కోసం కొత్త దేశాలు జయించటానికి బయలుదేరాడు. ఆయన ఒక ఏడాదిపాటు ఆసియాలోనూ, ఉత్తర ఆఫ్రికాలోనూ యుద్ధాలు చేసి విజయాలు సాధించి రోము చేరి క్లియోపాత్రాకు కబురు పెట్టాడు. ఆమె తన కొడుకును వెంటబెట్టుకుని ఓడలలో సపరివారంగా రోము చేరి, టైబర్ నదీతీరాన గల సీజరు భవనంలో బసచేసింది. ఆమె సీజరు ఉంపుడుకత్తె వలె బహిరంగంగా జీవిస్తూ ఉండటమూ, ఆమె వైభవమూ

చూసి ఆశ్చర్యపడటమే గాక అనుమాన పడ్డారు కూడా. ఎందుకంటే రోములో సీజరుకీర్తి చుక్కలను అంటుతూన్నప్పటికీ ఆయన కిరీటధారి కావాలనే దురాశతో ఉన్నట్టు రోమనులు అనుమానిస్తున్నారు.

ఈ అనుమానాలు రాను రాను పెద్దవై కుట్రకు దారితీశాయి. క్రీస్తుపూర్వం 44 లో జూలియస్ సీజరును హత్య చేసేశారు. క్లియోపాత్రాకు రోములో హితులెవ్వరూలేరు. ఆమెకక్కడ స్థానం లేదు. ఆమె మూడేళ్లపాటు తటస్థంగా ఉండి రోము వ్యవహారాలను ఈజిప్టు నుంచి గమనిస్తూ వచ్చింది. ఆ తరవాత మార్క్ ఆంటోనీ ఆమె జీవితంలోకి అడుగుపెట్టాడు.

సీజరు దుర్మరణం పొందాక ఆయన స్థానే ఆయన అభిమానులు ముగ్గురు "నాయకత్రయంగా" ఏర్పడ్డారు. వారిలో అగ్రగణ్యుడు మార్క్ ఆంటోనీ. ఇతను సీజరు అభిమాని. క్లియోపాత్రా రోముకు విహితురాలై ఉండి కూడా, అవసరం వచ్చినప్పుడు సహాయం రావటానికి మారుగా తటస్థంగా ఎందుకు ఉండిపోయిందో సంజాయిషీ చెప్పమనీ, తనను టార్సస్ వద్ద కలుసుకోమనీ మార్క్ ఆంటోనీ కబురు చేశాడు. రోములో బహునాయకంగా ఉన్నది; తనకు అండగా ఉండగలవారెవరో

వ్యాయామ శిక్షణ!



రేడియో:- ఇక కాళ్లు రెండూ పైకెత్తండి.

తెలియకనే క్లియోపాత్రా తటస్థంగా ఇంత కాలమూ ఉండిపోయింది. రోములోకెల్లా మహాశక్తిమంతుడైన మార్క్ ఆంటోనీని కలుసుకొని, అతని మైత్రి సంపాదించుకునే అవకాశం ఆమెకిప్పుడు లభించింది. అతని హృదయం వెన్నలాటిది. అతను సీజరు ప్రతిభకు వారసుడు. అతని కోసం సైనికులు ప్రాణాలర్పిస్తారు. తన అసమాన సౌందర్యంతోనూ, సాటిలేని వైభవంతోనూ అతన్ని సమ్మోహితుణ్ణి చెయ్యటానికి క్లియోపాత్రా నిశ్చయించింది.

రచ్చబండ వద్ద వేదికపై కూచుని క్లియోపాత్రా రాకకై ఎదురు చూస్తున్న మార్క్ ఆంటోనీ చుట్టూ గుమికూడిన ప్రజలు, క్లియోపాత్రా నౌక వచ్చి లంగరు దించినట్లు తెలియగానే అతన్ని ఒంటరిగా విడిచి నదీతీరానికి పరుగెత్తారు. వారి హర్షధ్వానాలు ఆంటొనీకి వినవచ్చాయి గాని, క్లియోపాత్రా ఎంతకీ రాదు. అతనికి చిరాకెత్తింది. ఆమెను భోజనానికి ఆహ్వానిస్తూ మనిషిని పంపాడు. అతనినే వచ్చి

తనవెంట భోజనం చెయ్యమని క్లియో పాత్రా ఎదురు ఆహ్వానం పంపింది. స్త్రీలంటే గౌరవ భావంగల ఆంటొనీ ఒప్పుకుని నదీతీరానికి బయలుదేరాడు. క్లియోపాత్రా ఎక్కివచ్చిన పడవను చూసే అతను విస్మయంచెందాడు. పడవ ముందు భాగం బంగారంతో చేసినది. తెరచాపలు ఊదా రంగువి. తెడ్లు వెండివి. క్లియోపాత్రా కామదేవత అయిన వీనస్ దుస్తులు ధరించి పవళించి ఉన్నది. ఆమె చుట్టూ బొమ్మల్లాంటి బానిసలు కొలువున్నారు. కమ్మని సంగీతం వినిపిస్తున్నది. సుగంధ ధూపాలు పడవను ఆవరించి ఉన్నాయి. వీటన్నిటికీ ముగ్ధుడైపోయిఉన్న ఆంటొనీ క్లియోపాత్రా తన మధుర కంఠం విప్పే సరికల్లా ఆమెకు వశుడైపోయాడు.

ఆనాడు అతను పుచ్చుకున్న విందు లాటిది అతను జన్మలో ఎన్నడూ ఎరగడు. నిజానికి అతను కూడా గొప్ప విందులు చెయ్యటానికి పేరు మోసిన వాడే, అయినా అతని విందులు ఇంత నాగరికంగా లేవు. ఒడ్డున గుమికూడి చూసే ప్రజలకు, దీపాలతో వెలిగిపోతున్న ఆ పడవలో సాక్షాత్తూ స్వర్గమూ దేవతలూ ఉన్నట్టు అనిపించింది.

ఆంటొనీ, క్లియోపాత్రాల అన్యోన్యం ఈ విధంగా ప్రారంభమై ఇదే తీరున పెరగసాగింది. ఇవాళ క్లియోపాత్రా ఆంటొనీకి దివ్యమైన విందుచేస్తే రేపు ఆంటొనీ క్లియోపాత్రాకు అంతకన్న దివ్యమైన విందు చేశాడు. వారిద్దరూ ఈ విధంగా పోటీపడి విందులు చేసుకోవటంలో క్లియోపాత్రాది అవలీలగా పైచెయ్యి అయిపోయింది.

టార్సస్‌లోనే వారు కొద్ది వారాలు గడిపారు. క్లియోపాత్రా ఆంటొనీని పూర్తిగా తనకు వశుణ్ణి చేసుకున్నది. ఆమె వాక్చాతుర్యమూ, ఆకర్షణాశక్తీ, ఉత్సాహమూ అతన్ని లోబరుచుకున్నాయి క్లియోపాత్రాను ఆంటొనీకూడా బలంగానే ఆకర్షించాడు. అయితే ఈ ఆకర్షణతో బాటు ఆమెలో స్వార్థచింత కూడా లేకపోలేదు.

టార్సస్ నుంచి క్లియోపాత్రా అలెగ్జాండ్రియాకు బయలుదేరినప్పుడు ఆంటొనీ ఆమె వెంట వెళ్ళాడు. ఇద్దరూ చలికాలమంతా అక్కడే గడిపారు. ఆ రోజులలో ఆమె భోగవిలాసాలకు మితిమీరిన ఖర్చు చేసింది. ఆంటొనీ ఆనంద డోలికలలో తూగులాడాడు. ఈ సుఖ స్వప్నం నుంచి రోము వ్యవహారాలు అతన్ని మేల్కొలిపాయి. రోము నుంచి అతనికి పిలుపు వచ్చింది.

రోమను నాయకత్రయం మధ్య సామరస్యం తగ్గిపోతున్నది. ఆ నాయకత్రయంలో ఆంటొనీ ఒకడు. మరొకడు ఆక్టేవియస్. ఆంటొనీ ఈజిప్టునుంచి బయలుదేరి వెళ్ళి ఆక్టేవియస్‌ను కలుసు

కున్నాడు. ఇద్దరిమధ్యా సంధి కుదిరింది. ఆక్టేవియస్ పశ్చిమ దేశాలనూ, ఆంటొనీ తూర్పు దేశాలనూ పంచుకున్నారు. తూర్పుదేశాలను అధీనంలో ఉంచే భారం ఆంటొనీది. ఈ ఒప్పందం మరింత దృఢంగా ఉండగలందులకు ఆక్టేవియస్ తనసోదరి అయిన ఆక్టేవియాను ఆంటొనీ కిచ్చి పెళ్ళికూడా చేశాడు.

క్రీ. పూ. 37 లో ఆంటొనీ సిరియాకు తిరిగివచ్చి క్లియోపాత్రాను తిరిగి కలుసుకున్నాడు. మళ్ళీ అతనికి ఇంద్రవైభోగం లభ్యమయింది. ఇలా కొంతకాలం జరిగాక ఆంటొనీకి పార్థియనులతో యుద్ధం తటస్థపడింది. ఈ యుద్ధంలో విజయం చేకూరగానే ఆంటొనీ క్లియోపాత్రాలు తమ సొంత సామ్రాజ్యం వ్యవస్థాపన చేద్దామని కలలు కన్నారు.

కాని ఈ యుద్ధంలో ఆంటొనీ ఓడిపోవటమేగాక తన సైన్యంలో చాలా భాగం పోగొట్టుకున్నాడు. శిథిలమైన తన సేనతో అతను శ్వేతగ్రామం అనే రేవు చేరి, క్లియోపాత్రా కళ్ళబడటానికి ముఖం చెల్లక తప్పతాగుతూ ఉండిపోయాడు.

ఈ విషాదవార్త అందగానే క్లియోపాత్రా అతనున్నచోటికి వెళ్ళింది. అయితే త్వరలోనే ఆంటొనీ ఆర్మీనియనులపై విజయం సాధించి ఈ పరాభవాన్ని మరిచిపోగలిగాడు.

అదివరకే తన భార్య అయిన ఆక్టేవియాతోనూ, తన బావమరిదీ, సహనాయకుడూ అయిన ఆక్టేవియస్‌తోనూ సత్సంబంధాలు లేకుండా ఉన్న ఆంటొనీ ఆర్మీనియా విజయం అనంతరం రోమునే తూలనాడాడు - తన విజయోత్సవాన్ని రోములో జరపక, అలెగ్జాండ్రియాలో జరిపి, రోముకన్న అలెగ్జాండ్రియాయే మహత్తరమైన రాజకీయ కేంద్రమని సూచించాడు. ఇంతేగాక ఈ ఉత్సవం లోనే అతను రోము సామ్రాజ్యానికి చెందిన రాజ్యాలను క్లియోపాత్రాకూ, ఆమె సంతానానికీ ధారాదత్తం చేశాడు. ఇలా చెయ్యటం వల్ల అతను ఆక్టేవియస్‌తో యుద్ధం కొనితెచ్చుకున్నాడు.

ఒకప్పుడు మహాయోధుడూ, దీక్షాపరుడూ, సమర్థుడూ అయి ఉండిన ఆంటొనీలో అలక్ష్యమూ, భోగలాలసతా ఏర్పడ్డాయి. అతనిపట్ల క్లియోపాత్రాకు కొంత సంకోచం ఏర్పడింది. ఆమె ప్రేమ ముక్కపోయింది.

ఆక్టేవియస్ నౌకాబలాలను ఎదుర్కోవటానికి ఆంటొనీ తన నౌకలతో బయలుదేరేటప్పుడు క్లియోపాత్రా తానుకూడా వెంట వెళ్ళింది. ఆరు గంటలపాటు యుద్ధం సాగింది. ఒక పక్షం ఓడినట్టుగాని, ఒకపక్షం గెలిచినట్టుగాని నిర్ధారణ కాకముందే క్లియోపాత్రా తన అరవై నౌకలనూ వెంటబెట్టుకుని ఎవరికీ తెలియ

కుండా నిష్క్రమించింది. ఆమె అలా ఎందుకు చేసిందో తెలియదు.

క్లియోపాత్రా వెళ్ళిపోతూండటం చూసి ఆంటొనీ వెర్రివాడులాగా యుద్ధరంగాన్ని వదిలి తన నౌకతో ఆమెను అనుసరించాడు. దీనితో ఈజిప్టుకూ, క్లియోపాత్రాకూ, ఆంటొనీకీ భవిష్యత్తు లేకుండా పోయింది. ఆక్టేవియస్ రోమన్ సామ్రాజ్యానికి మొదటి చక్రవర్తి అయాడు. అది చరిత్రకు సంబంధించిన విషయం.

క్లియోపాత్రా అలెగ్జాండ్రియాకు వెళ్ళి దానిని రోము సైన్యాలనుంచి రక్షించుకునే ఏర్పాట్లు ప్రారంభించింది. కొత్త సైన్యాలను పోగుచేసుకునే గొంతెమ్మ కోరికతో ఆంటొనీ లిబియాకు వెళ్ళాడు. కాని ఇద్దరివీ వ్యర్థ ప్రయత్నాలే. అంటొనీ తన ప్రియురాలి వద్దకు తిరిగివచ్చాడు. ప్రేమికులుగా ఒకేసారి చావటం తప్ప వారికి ఇక మిగిలిందేమీ లేదు.

ఈజిప్టు పాలకులు తమ సమాధులను తాము బతికి ఉండగానే తయారు చేయించటం ఆచారం. క్లియోపాత్రా తన సమాధిని తానే స్వయంగా తయారు చేయించుకొని, తనకున్న విలువైన వస్తువులన్నిటితోనూ అందులో ప్రవేశించింది.

ఇంతలో ఆక్టేవియస్ అలెగ్జాండ్రా వద్దకు తన సైన్యంతో వచ్చాడు. అంటొనీ అతన్ని ఎదిరించి అతని ఆశ్వికదళాలను పారదోలగలిగాడు. అయితే అదే అతని ఆఖరు విజయం. రెండవసారి అతను ఆక్టేవియస్ పైన పడబోయే సమయానికి ఆంటొనీ అనుచరులు అతన్ని వదిలిపెట్టి పారిపోయారు.

ఈ సమయంలోనే అతనికి క్లియోపాత్రా ఆత్మహత్య చేసుకున్నదన్న అసత్య వార్త తెలిసింది. క్లియోపాత్రా కూడా పోతే ఆంటొనీకి ప్రపంచంలో ఇంకేమీ లేదు. అతను ఆత్మహత్య చేసుకుందామని కత్తితో పొడుచుకున్నాడు. కాని అతను వెంటనే చావలేదు. తనను మళ్ళీ పొడవమంటే అతని అనుచరులెవరూ ఆ పని చేయలేదు.

అతని కోరికపై అతన్ని క్లియోపాత్రా సమాధి వద్దకు చేర్చారు. క్లియోపాత్రా బతికేఉన్నది. ఆమెకు ఆంటొనీపై ఉండిన పాతప్రేమంతా తిరిగి వచ్చింది. అతను ఆమె చేతుల్లోనే ప్రాణాలు వదిలాడు.

నిజానికి ఆంటొనీ పోయినాక క్లియోపాత్రకుకూడా జీవితంలో ఇంకేమీలేదు. ఆమె భవిష్యత్తు ఆక్టేవియస్‌కు బందీగా దొరికి సంకెళ్ళతో రోమునగరంలో ఊరేగడమో, లేక ఆత్మహత్య చేసుకోవడమో! ఈజిప్టురాణి బానిసగా ఎలా పట్టుబడుతుంది? ఆమె తన చెలికత్తెల సహాయంతో ఒక విష సర్పాన్ని సంపాదించి, దానిచేత రొమ్ముపై కాటు వేయించుకుని ప్రాణాలు విడిచింది. ★

# ప్రశ్నావేదిక

కె భవాని, కాకాని

సాహిత్యం యొక్క ప్రయోజనం ఏమిటి ?

వ్రాసేవారి మనస్సులూ చదివే వారి మనస్సులూ ప్రక్షాళన కావటం

*　　　*　　　*

పి రమా కాంతరావు, ఆదోని

డిటెక్టివ్ సాహిత్యాన్ని గురించి మీ ఉద్దేశం ఏమిటి ?

అదంటె మాకు భయం లేదు

*　　　*　　　*

యం మృత్యుంజయరావు, బొబ్బిలి

ఈ ఎలెక్షన్లలో మీకు ఏపార్టీ గెలవాలని వుంది ?

ప్రజలకు ఇష్టమయిన పార్టీ

*　　　*　　　*

ఇ సుందరరావు, రంగూన్

గోవా విముక్తిపట్ల అమెరికా, ఇంగ్లండు దేశాలు ప్రదర్శించిన దృష్టిని బట్టి మనం నేర్చుకోవలసింది ఏమిటంటారు ?

హృదయ పరివర్తనం సులభ సాధ్యం కాదని

*　　　*　　　*

బి వెంకట్రావు, శ్రీకాకుళం

గోవా పోలీసు చర్యను గురించి మీ ఉద్దేశం ఏమిటి ?

పదునాలుగు సంవత్సరాలు ఆలస్య మైందనీ, అందువల్ల లేని పోయిన చిక్కులు కొన్ని తెచ్చిపెట్టుకున్నామనీ

ఈ చర్యవల్ల యునైటెడ్ నేషన్స్ బలహీన పడిందంటారా ?

ఈ చర్యవల్ల బలహీన పడింది వలస రాజ్యాలు వలసరాజ్యాలు బలహీన పడటం సక్రమమైన దృష్టితో చూస్తే యునైటెడ్ నేషన్స్ బలపడటమే ! ★



మనిషిలో మడిసి :

# చీకటి గదులు

సీరియల్

గోపీచంద్

"ఈ రోగంలో గుండె ఆగే ప్రమాదం వుందన్నాడు డాక్టరు. ఆమె గుండె అసలే బలహీనమైనది. ఈ జబ్బు వచ్చేముందు ఎంత చిన్నపని చేసినా ఆమెకు రొప్పు వచ్చేది. ఆ మధ్య మే మిద్దరం వొక నాటక ప్రదర్శన చూడటానికి వెళ్లాం. నాకు నాటకాలు చూసే అలవాటు లేదని నీకు తెలుసు. అది హరిశ్చంద్ర నాటకం. ఆమెకు ఎందుకో చూడాలని బుద్ధి పుట్టింది. ఇద్దరం వెళ్ళాం. హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మే సీను వచ్చేటప్పటికి ఆమె కూర్చోలేక పోయింది. కండ్లు బయర్లుకమ్మినై. ప్రక్కన కూర్చున్న నాకే ఆమె గుండెదడ వినిపించింది. నెమ్మదిగా ఇంటికి తీసుకువచ్చాను. వొకరోజు రోజంతా ఆమె మంచం మీద నుంచి లేవలేక పోయింది. అప్పుడే డాక్టర్ని తీసుకు వస్తానంటే ఆమె నామాట వినలేదు. అటువంటి బలహీనమైన గుండె కలిగిన ఆమె ఈ జబ్బు తట్టుకో గలుగుతుందా? ఇప్పుడు ఈ కీలూ, అప్పుడు ఆ కీలూ పట్టుకొని, వుండి వుండి గుండెను పట్టుకుంటుందట ఈ జబ్బు." అని వొక పెద్ద నిట్టూర్పు విడిచారు కృష్ణస్వామిగారు.

"మీరు విచారపడకండి. మీరు ధైర్యం కోల్పోతే, మేము అసలు నిలువలేం," అన్నాడు గోపాలం.

ఇక కొడుకుతో మాట్లాడలేక, కొడుకు ముందు తన గోడు వెళ్ళబోసుకోలేక, అక్కడనుంచి వెళ్ళిపోయారు కృష్ణస్వామిగారు.

గోపాలం అక్కడే కూలబడ్డాడు.

"లోపలకు వొచ్చి కాసిని కాఫీ తాగు బాబూ," అన్నది రత్నమ్మగారు ఇంట్లోనుంచి వచ్చి.

"వొద్దు, అమ్మమ్మా వొద్దు," అన్నాడు గోపాలం.

తన తండ్రి మాటల్లోని యదార్థం ఆ రాత్రి ప్రత్యక్షంగా చూశాడు గోపాలం. తన పినతల్లి పడే వేదనను ఇన్ని రాత్రులు తన తండ్రి భరించ గలగటం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

రాత్రి పదిగంట లయ్యేటప్పటికి ఆమె జ్వరం ఉధృత రూపం ధరించింది. కాళ్లూ చేతులూ ఆడించే వీలువుంటే ఆమె బాధ కొంచం ఉపశమించే దేమో, ఆమె అందుకు నోచుకోలేదు.

ఎటు వేసిన కాలు అటే, ఎటు వేసిన చెయ్యి అటే, కదిలించే ప్రాప్తం లేకుండా ఆమె పడి వుంది. లోపల ఎంత బాధ వుందో? అంత నిబ్బరం కలిగిన మనిషి నైతం దానిని భరించలేక పెద్ద పెట్టున మూలుగ నారంభించింది.

"ఎక్కడ నొప్పి" అని అడిగితే కళ్లు తెరిచి చూడటం కంటే పెదవి కదల్చేదికాదు. కండ్లలో నీరు గిర్రున తిరిగేది.

ఆమె మాట్లాడక పోవటం ఉద్దేశ పూర్వకంగానో, నాలుక కదలకో చెప్పటం కష్టం.

ఉండి ఉండి ఏదో వొక మాట అనేది. ఆ మాట ఈ లోకానికి సంబంధించిన మాటగా ఉండేదికాదు. ఏమిటి అని అడిగితే సమాధానం వుండేదికాదు. ఏం కావాలో ఆమెకే తెలియదు. ఇక ఇతరులకు ఏమి చెప్పగలుగుతుంది?

పది గంటలకల్లా అందరూ వారి వారి పనులు పూర్తిచేసుకొని, ఆమె మంచం చుట్టూ జేరారు.

రత్నమ్మగారూ, కమలా చాపపరచుకొనీ, కృష్ణస్వామిగారు కుర్చీలోనూ, గోపాలం మంచం మీద పినతల్లి కాళ్ల దగ్గర కూర్చున్నారు. ఎవరికి వారికి పెదవి కదల్చటం భయంగానే వుంది.

"మీరు మళ్లీ ఉదయమే లేచి పనిచెయ్యవలసి వుంటుంది. మీరు వెళ్ళి పడుకోండి" అన్నారు కృష్ణస్వామిగారు రత్నమ్మగారితో.

"నా పడక కే మొచ్చింది?" అన్నది ఆమె. అంతేగాని అక్కడ నుంచి కదల్లేదు.

అందరి చూపులూ పడుకొనివున్న దమయంతి మీదే వున్నాయి. ఆమె మూలుగులకు అందరి మనస్సులూ బాధపడుతున్నయి. బాణం గురిపెట్టిన వానికి మాత్రమే తగిలి బాధ పెడుతుంది. మూలుగు అలా కాదు, వినిపించుకున్న వారందరినీ బాధపెడుతుంది. చుట్టు ముట్టి, కట్ట కట్టి క్రుంగదీస్తుంది.

కొంచం సేపు గడిచిన పిదప దమయంతి కలవరింతలు ప్రారంభించింది. ఇదే మొదటి సారిగా వింటున్న గోపాలం తత్తరపడి తండ్రి వంకకు చూశాడు. ఆయన ఏం చెప్పగలడు? గోపాలాన్ని ఎలా వోదార్చగలడు.

"ఆ మాటలు తెలిసి మాట్లాట్టంలేదు" అని కన్నీరు తుడుచుకున్నారు కృష్ణస్వామిగారు.

"డాక్టర్ని తీసుకురానా?" అని అడిగాడు గోపాలం.

"ఆయన వచ్చి చేసేది ఏమీ లేదు. ఈ రాత్రి ఇట్లా గడిచి పోవలసిందే," అన్నారు కృష్ణ స్వామిగారు.

"ఉపశాంతికి ఏమైనా ఇస్తారేమో!"

"మరీ ఎక్కువగా ఉంటే వెయ్యమని వొక మందు పొట్లాం ఇచ్చాడు. ఆ మందు జబ్బును నయంచేసేది కాదు. బాధను నివారించేది కాదు. నిద్ర పట్టించేది. మగతను కలిగించేది," అన్నారు కృష్ణస్వామిగారు.



సమిష్టి కుటుంబము

"ఏదైనా మనకీ బాధ తప్పుతుంది గదా! ఆమె బాధ పడుతుంటే ఏమీ చెయ్యకుండా చూస్తూ కూర్చోవటం కష్టంగావుంది," అన్నాడు గోపాలం చెదరిన కంఠంతో. రత్నమ్మగారు అతని బాధను గ్రహించింది. అతనికి సమాధానం చెప్పే స్థితిలో కృష్ణస్వామిగారు లేరనే విషయం గమనించింది.

"మీ రిక్కడ వుండి చేసేది ఏముంది? నేనూ, కమలా చూస్తూ వుంటాం. మీరు వెళ్ళి పడుకోండి. వేళకు మందు కమల ఇస్తూ వుంటుంది. అంతగా అవుసరమైతే, అప్పుడు వొద్దురుగాని," అన్నది.

"నువ్వువెళ్లు గోపీ," అన్నాడు కృష్ణస్వామిగారు.

గోపాలం మాట్లాడలేదు. అందరూ ఎవ్వరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. ఎవ్వరూ మాట్లాడలేదు. అనుకోవటం, అనటమేగాని ఏ వొక్కరూ కదలరని మిగిలిన అందరికీ తెలుసు.

"చూడమ్మా. అమ్మాయి పెదవి తడుపుకుంటూవుంది. మంచినీళ్ళు కావాలేమో, గరిటెతో కాసిని పొయ్యి," అన్నది రత్నమ్మగారు కమలతో.

కమల పొయ్యగా నాలుగైదు చెంచాల నీళ్లు గుటకలు వేసింది దమయంతి.

"జాగర్తగా పొయ్యమ్మా. నీళ్ళు బొట్లు పడి మెడ దగ్గర దిండు తడుస్తుంది," అన్నది రత్నమ్మగారు.

నీళ్లు గుటకలువేసి కాస్త తేరుకుంది దమయంతి. కండ్లు విప్పి కమలను కాస్త తెలివిగా చూచింది.

"నువ్వు పోస్తున్నావా?" అని అడిగింది,

"అమ్మమ్మకు చేతగాదు. పక్క తడుపుతుంది," అన్నది కమల.

"ఇన్నాళ్లూ ఎవ్వరు పోస్తున్నారు అమ్మకాక? మీ నాన్నగారా?," అని అంత బాధలోనూ హాస్యమాడింది దమయంతి.

"సరిసరి పడుకో," అన్నాడు కృష్ణస్వామిగారు

"మీరు కూర్చున్నారు సరే, బాగానే వుంది. ఎందుకు అబ్బాయిని కూడా కూర్చోబెట్టారు?" అని అడిగింది దమయంతి గోపాలాన్ని గురించి.

"అతను నా మాట వినలేదు."

"ఏమయ్యా, అప్పుడే తండ్రిగారి మాట తిరస్కరించేదాకా వచ్చావా? అలా చెయ్యకు. ఆయన పైకి కనపడక పోయినా లోపల చాలా బాధపడతారు," అన్నది దమయంతి.

అంత కష్టసమయంలోనూ ఆమె మాటలకు చిరునవ్వు నవ్వగలిగారు కృష్ణస్వామిగారు. "నేను బాధ పడకుండా వుండాలంటే నువ్వు మాట్లాడకుంటే చాలు."

"మాట్లాడ వలసిన అవసరం నా కేమిఉంది? అన్నది దమయంతి.

"పెద్దవాళ్ళు మొదలుకొని చిన్నవాళ్ళవరకూ నా నోటివెంట ఏమాట రాకముందే పనులన్నీ చేసి పెడుతుంటే ఇంకా నాకు మాట్లాడ వలసిన అవసరం ఏముంది?"

ఈ మాటలు అంటూ వుండగానే ఆమెకు మళ్ళీ స్మృతి తప్పుతూ వుందని గ్రహించింది రత్నమ్మగారు. "ఎందుకు అమ్మాయిని అట్లా వాగిస్తారు? కాసేపు పడుకోనివ్వండి" అని దమయంతికి కప్పిన శాలువా కఠంవరకూ సర్దింది.

ఆ పట్టు పట్టు తెల్లవారి నాలుగయిదు అయ్యేవరకూ ఆమె మన స్పృహలో లేదు. మూలుగుతూ కలవరిస్తూ వుంది. అర్థం వున్నవీ లేనివీ ఏదోవొకటి అస్తమానం మాట్లాడుతునే వుంది.

ఆమె మాటలనుబట్టి తమకు కనపడని దృశ్యాలేవో ఆమెకు కనుపిస్తూ వున్నాయని ఊహించాడు గోపాలం.

జ్వర తీవ్రతలో, నరాలు లాగే స్థితిలో అలా కొన్నికొన్ని చిత్రమైన దృశ్యాలు కనుపించడం కద్దు. అవి ఎక్కడనుంచి వస్తున్నయి? ఎందుకు కనుపిస్తున్నయి. అవి నిజమా? అబద్ధమా? జ్వర తీవ్రతవల్ల కనుపిస్తున్నయ్యనీ, మనస్సు ఆందోళనా పూరిత మైనప్పుడు అలా కనుపిస్తాయనీ అంటారు. కాని దానివల్ల తేలిందేముంది? అవి ఎలా కనుపిస్తున్నయ్యో, అలా కనుపించటం ఎలా సంభవం అయిందో ఆ విషయాలు తేలలేదుగదా! అవి ఇప్పట్లో తేలవుకూడాను.

ఆమె తృళ్ళిపడి లేచింది. "అబ్బాయి ఇంకా రాలేదా?" అని ఎదురుగావున్న భర్తను అడిగింది.

"అదుగో," అని ఆమె కాళ్ళదగ్గర వున్న గోపాలాన్ని చూపి, "ఇప్పటిదాకా మాట్లాడి అట్లా అడుగుతావేమిటి?" అన్నారు కృష్ణస్వామిగారు.

"ఎవ్వరు ఇప్పటిదాకా మాట్లాంది?" అని ఆశ్చర్యంగా అడిగింది దమయంతి.

"నీవేగదా?"

"ఎవ్వరితో?"

"గోపాలంతో?"

"అవును మరచేపొయ్యాను!" అని గోపాలంవైపు తిరిగి, "ఏమయ్యా, నాకు ఇటీవల మతి సరిగ్గా వుండటం లేదుగదూ?" అని అడిగింది.

గోపాలం మాట్లాడలేదు.



## రంగుల మామయ్య

"చెప్పవ్ ? నువ్వొచ్చి నిజం చెపుతావను కున్నాను," అని నిష్ఠూరంగా అన్నది

"ఎందుకమ్మా అలా అనుకుంటావు. నీ మతికివచ్చిన ఇబ్బంది ఏమీలేదు" అన్నాడు గోపాలం.

అన్నాడేగాని ఇక భరించలేక పోయాడు ఆమె దుస్థితికి అతని మనస్సు వ్రక్కలయింది. నోటికి చేతిరుమాలు పెట్టుకొని ఏడుస్తూ అక్కడనుంచి లేచి తన గదిలోకి వెళ్ళాడు.

గోపాలం వొస్తే తనకు కొంత ధైర్యంగా వుంటుందనుకున్న కృష్ణస్వామిగారికి, గోపాలం ఏడుపుతో ఆనకట్ట తెగినట్లయింది కండ్లవెంట నీరు నిర్విఘ్నంగా ప్రవహించింది ఆయనకు తుడుచుకోవాలని కూడా అనిపించలేదు.

కమల రత్నమ్మగారి వొడిలో తలపెట్టుకొని ఏడ్చింది రత్నమ్మగారు దుఃఖంతో కొయ్యబారి పోయారు.

* * *

గదిలో పక్కపరచివున్న మంచంమీద పడుకొని మనసారా ఏడ్చాడు గోపాలం. అతని మెదడులోవున్న ఆలోచనలూ, హృదయంలోవున్న ఆవేశాలూ వొకచోట సంగమించి, ప్రవాహ రూపంలో కన్నీరుగా బయటకు ఉరికింది. మెదడూ, హృదయం, లోకం అన్నీ అతనికి శూన్యంగా కనుపించినై మొక్కనైతం మొలవని పెద్ద బయళ్లుగా కనుపించినై. ఆ బయళ్ళను, ఆ శూన్యాన్ని తన కన్నీటితో తడపటంకంటే తను చెయ్యగలిగింది గానీ, చెయ్యదగ్గదిగానీ అతనికి ఏమీ కనుపించలేదు.

పినతల్లి ఏదో మాట్లాడుతూవుంది. రత్నమ్మగారు ఆమెకు ఏదో సమాధానం చెపుతూవుంది. అంతా నాటకం. ఆమె అడిగేదానికీ అర్థంలేదు. ఈమె చెప్పేదానికీ అర్థంలేదు. కాని రెండు పనులూ జరిగి పోతున్నయి.

తండ్రి ఏమీ మాట్లాడడంలేదు. అంతమనిషి నిస్సహాయుడై, పసిపిల్లవానికి మల్లే కన్నీరు పెట్టుకుంటూ కూర్చోవటం భగవంతుని సృష్టిలోని ఘోరాన్యాయాలలో వొకటిగా కనుపించింది గోపాలానికి.

"ఎవ్వరు ఆయనమీద కక్ష తీర్చుకుంటూ వుంది?"

"ఎందుకు ఆయనమీద కక్ష కట్టింది?"

"అందుకు తన పినతల్లిని హింసపెట్టడం ఎంత అన్యాయం?''

ఆక్షణం భగవంతుడు లేడనే తన తండ్రివాదంలోవున్న సమంజసత్వం అతని మనోవీధిలో స్వైర విహారం చేసింది. నిర్దాక్షిణ్యంగా బ్రతకడంకంటే ఈ లోకంలో ఏముంది?

అతనికి తెలియకుండానే అతని గుప్పెళ్లు బిగిసినై. ఎవ్వరి మీదో పగనీ, క్రౌర్యాన్నీ పెంచు కుందా మనుకున్నాడు. వొక్కొక్కప్పుడు బ్రతకటానికి. అవీ అవుసరం అనిపించింది.

"బాబూ?" అనే పిలుపు వినిపించింది.

''ఎవ్వరు?'' ఉలిక్కిపడ్డాడు గోపాలం.

ఆమె ఏమి చెప్పటానికి వచ్చిందో అని భయంవేసింది గోపాలానికి.

''చూస్తున్నావుగా నాయనా, కాటికి కాళ్లు చాచుకొనివున్న ఏ నాబోటి దానికో రాగూడదూ ఈ జబ్బు?'' అన్నది రత్నమ్మగారు కండ్లు తుడుచుకుంటూ.

"ఈజబ్బు ప్రమాదమేనా అమ్మమ్మా?"

"ప్రమాదమా అంటే ఏజబ్బు ప్రమాదంకాదుబాబూ? పూర్వం పల్లెటూళ్ళల్లో ఈ జబ్బులు చాలా ఎక్కువగా వొస్తూవుండేవి. మూలిగినన్నాళ్లు మూలిగి వాళ్ళదారిన వాళ్లు వెళ్ళిపోతుండే వారు. ఆ రోజుల్లో తిండిపుష్టి లేకపోవటంవల్ల ఈ జబ్బులు వొస్తయని అనుకునేవాళ్ళం బాబూ. ఇప్పుడు అమ్మాయికి ఏం తక్కువై వొచ్చినట్టు? ఏదో అనుకుంటాంగాని, అవి రావలసే వొస్తూ వుంటై. ఎందుకయినా మంచిది నాయనా అమ్మాయి కన్నవారింటికి కబురుపెట్టు. ఆమె అన్నలు కూడా వచ్చివుంటే సలహాలకీ, సంప్రతింపులకూ అనువుగా ఉంటుంది."

అంతవరదాకా తన పినతల్లి కన్నవారి సంగతే జ్ఞాపకం రాలేదు గోపాలానికి. రత్నమ్మ గారు గుర్తుకు తెచ్చేటప్పటికి వాళ్ళకు ఎప్పుడో కబురు పెట్టవలసిందని అతనికి అనిపించింది.

"ఇంతవరదాకా వాళ్ళకు కబురు చెయ్యలేదా అమ్మమ్మా?''

"లేదుబాబూ, నేను అప్పుడప్పుడూ అంటున్నా, అమ్మాయి ఆమాట పెడచెవిని పెట్టింది. వాళ్లువొచ్చి చేసేది ఏముంది?" అనేది. కాని వాళ్ళకి కబురు పంపటం ధర్మం. మా అమ్మాయికి ఇంతజబ్బుచేస్తే కబురన్నా పంపకపోయారు అని వారు ఎప్పుడైనాఅంటే మనం ఏం సమాధానం చెపుతాం. వాళ్ళతో ఆమాటమాత్రం ఎందుకు అనిపించుకోవాలి. తెల్లవారగానే తప్పకుండా కబురు చెయ్యిబాబూ. ఎవ్వరినో వొకర్ని వున్నవాళ్ళని ఉన్నట్టు రమ్మను."



హ....లో....పోలీ....స్....మా ఇంట్లో దొంగ....లో....దొంగ....లు!

"అట్లాగే అమ్మమ్మా.

తెల్లవారి మూడుగంటల దగ్గరనుంచీ దమయంతి జ్వరం తగ్గుముఖం పట్టింది. నెప్పులుకూడా తగ్గినై. ఆమె మూలుగుడు ఆపింది. ఆమెకు నిద్ర పట్టింది.

ఇతరులు, కునికిపాట్లు పడ్డారేమోగాని రత్నమ్మగారు మాత్రం రాత్రంతా జాగారం చేసింది. రెప్పవెయ్యలేదు. కమల, కూర్చున్న చాపమీద కూర్చున్నట్లే నిద్రపోయింది. కృష్ణస్వామిగారు కాసేపు నడుంవాలుద్దామనే వుద్దేశంతో తన పడక గదిలోకి వెళ్ళారు.

రత్నమ్మగారు ఇంటిపనిలో నిమగ్నురాలైంది. కంటికి కూరుకు లేకుండా ఆమెగారు ఎన్ని రాత్రులు ఆ విధంగా గడిపిందో ఆ భగవంతుడికే తెలియాలి.

తెల్లవారి ఎనిమిది గంటలకు కాస్త కన్ను తెరిచింది దమయంతి. జ్వరం, నొప్పులూ తగ్గటంవల్లా, కాసేపు నిద్రపోవటంవల్లా, ఆమె ముఖం ప్రశాంతంగా నిర్మలంగా వుంది.

ఆమె కన్ను తెరిచేటప్పటికి కాళ్ళదగ్గర కూర్చునివున్న గోపాలం కనుపించాడు. ఆమె చిరునవ్వు నవ్వుతూ "రాత్రంతా అట్లాగే కూర్చున్నావా అబ్బాయి?'' అని అడిగింది.

"లేదమ్మా, ఇప్పుడేవచ్చి కూర్చున్నాను."

"నా జబ్బుసంగతి ఆలోచించడంతప్ప ఈ ఇంట్లో ఎవ్వరికీ ఇంకొకపని లేదనుకుంటాను,'' అన్నది దమయంతి గోపాలం చూపుల్లోని ఆవేదననూ, ఆందోళననూ గమనించి.

"చూడమ్మ నీజబ్బుని తేలికపరుస్తూ నువ్వు మాట్లాడవలసిన పనిలేదు. నీకు జబ్బు ఎక్కువ

గానే వుందనీ, దానివల్ల నువ్వు చాలా బాధ పడుతున్నావనీ మా అందరికీ తెలుసు'' అన్నాడు గోపాలం.

గోపాలాన్ని పరీక్షగా చూస్తూ, "ఊఁ తెలిస్తే?" అని అడిగింది దమయంతి.

"నువ్వు డాక్టరు ఇచ్చిన మందు తాగాలి. మేము చెప్పినట్లు చెయ్యాలి. ఎక్కువ మాట్లాడ గూడదు,'' అన్నాడు గోపాలం.

"సరి. నీకంటే మీ నాన్నగారే నయంలాగుంది. నీ హయాంవస్తే మా అందరినోళ్ళకీ తాళాలు వేసేటట్టు వున్నావు" అన్నది దమయంతి చిరునవ్వునవ్వుతూ.

"అవుసరం అయినప్పుడు తప్పేది ఏముంది?'' అన్నాడు గోపాలం.

అంతలోకి కాఫీ పట్టుకొచ్చింది రత్నమ్మగారు.

"అబ్బాయికి ఇచ్చావా అమ్మా?" అని అడిగింది దమయంతి.

"ఏదీ, అతను ఇప్పుడే లేచాడు. ఇస్తాను."

రత్నమ్మగారు అందించిన కాఫీ దమయంతి ఎదురు మాట్లాడకుండా తాగింది. ఆమె అలా తాగుతుంటే ఆశ్చర్యంగా చూసింది రత్నమ్మగారు. రోజూ కాఫీ తాగటానికి పెద్ద గ్రంథం జరిగేది.

కాఫీకప్పు రత్నమ్మగారికి అందిస్తూ, "కాఫీ ఇచ్చింది ఇచ్చినట్లు తాగకపోతే అబ్బాయిగారు వూరుకునేటట్లులేదు. అందుకని మెదలకుండా తాగాను. నావల్ల ఎందుకు ఇతరులకు కోపం రావటం?'' అన్నది దమయంతి.

"ఏదోవొక దారకం లేకపోతే ఎట్లాతల్లీ? అందుకని గట్టిగా అంటారు ఎవ్వరైనా,'' అన్నది రత్నమ్మగారు.

రత్నమ్మగారు లోపలికి వెళ్ళగానే, "మీ నాన్నగారు లేరా?" అని అడిగింది దమయంతి.

"వూళ్ళోకి వెళ్లారు."

"మళ్ళీ ఏ స్వాములవారి దగ్గరకో, ఏ వైద్యుని దగ్గరకో వెళ్ళి వుంటారు," అని నిట్టూర్పు విడుస్తూ అన్నది దమయంతి. "నా జబ్బుకేంగాని ఆయన్నిచూస్తే నాకుచాలా విచారం వేస్తూ వుందయ్యా. ఆయన సరిగ్గా భోజనంచేసి విశ్రాంతి తీసుకొని ఎన్నాళ్ళయిందో! జబ్బులు వస్తయి, నయం అవుతయి. ఒకవేళ, మాటవరుసకు అనుకుందాం, నయం కావనుకో దానికింత హైరాన పడిపోవటం ఎందుకు? ఎవ్వరం ఇక్కడ శాశ్వతంగా వుండటానికి రాలేదుగదా! అందరం ఎప్పుడో వొకప్పుడు వెళ్ళిపోవలసినవాళ్ళమేగదా, దీనికింత గొడవ ఎందుకు? చెపితే వినిపించుకోరు. పైగా నాకోసం ఆయనకు చిన్నప్పటినుంచీ వున్న నమ్మకాలను వొక్కొక్కదాన్నీ వొదులుకుంటున్నారు. ఆ నమ్మకాలనన్నిటినీ వొదులుకొని తరువాత చేసేదిమాత్రం ఏముంటుంది? నామాట వినేటట్టులేరుగాని నువ్వుచెప్పుబాబూ ఆయనకు?'' అన్నది దమయంతి.

(సశేషం)

Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI"

## గతమాసం చిత్ర పరిచయ పోటీ



బహుమతి పొందిన వ్యాఖ్య :

"బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా జూదరుల్"

పంపినవారు : యన్. మోహనరావు, హైదరాబాద్ — 4

---

చిత్ర పరిచయ పోటీకిగాను వేయబడిన బొమ్మకు సరియైన వ్యాఖ్య వ్రాసినవారికి పదిరూపాయల విలువగల పుస్తకములను బహుమతిగా పంపుతాము. ఇంగ్లీషు కాప్షన్ పనికి రాదు. వ్యాఖ్య ఈ నెల 20 వ తేదీలోగా యువ సంపాదకునికి చేరాలి.


జిందా తిలస్మాత్
దగ్గు, జలుబు, పడిశెం, మలేరియా జ్వరం, తలనొప్పి, కలరా, గర్భసంబంధక వ్యాధులు తక్కిన శారీరక సంబంధమైన అన్ని నొప్పులూ, తేలుకాటు- అన్నిటికీ గుణమిచ్చును
ఒక సీసాను ఎల్లప్పుడూ మీ వద్ద వుంచుకోండి
అన్నిచోట్లా అమ్మబడును
వెల రూ 1-8-0
0-12-0 అణాలు.
0-6-0అణాలు మాత్రమే


ZINDA TILISMATH
HYDERABAD DECCAN


UNIVERSAL

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-అఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని : మదరాసు-26
ఫోన్ 83851—4 లైన్లు

# చందమామ

పిల్లల కథల మాస పత్రిక



చందమామ అందరూ చదువుతారు

★

చందమామ పబ్లికేషన్స్

మద్రాసు - 26



"గుండమ్మ కథ"లో
కోడలు